దినాతిదీనులు : 2

# సంచార జాతులు




చిట్టావూరు
నాగభూషణాచార్యులు

# సంచార జాతులు

# (NOMADIC TRIBES)



గ్రంథకర్త:

**చిట్టావూరు నాగభూషణాచార్యులు** B. A., B. Ed.,

(రిటైర్డు బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు)

ఎడిటర్: "పంచాయతీరాజ్యం" (పక్షపత్రిక); "విశ్వశిల్పి" (మాసపత్రిక)

నరసరావుపేట.

సహాయకులు

శ్రీమతి చిట్టావూరు అక్కమ్మా నాగభూషణాచార్యులు

శ్రీమతి చిట్టావూరు వెంకటసత్యవతి శివరామకృష్ణ B. Sc.,

ప్రకటన:

**చిట్టావూరు సోదరులు**

దీనాతిదీనుల చరిత్ర పరిశోధనా కేంద్రం,

నరసరావుపేట.

ప్రథమ ముద్రణ : ప్రతులు 1000

1977 ఆగస్టు

పింగళ, శ్రావణము

మూల్యం : రు. 10/-

ప్రతులకు:

చిట్టావూరు నాగభూషణాచార్యులు

పత్రికా సంపాదకులు

నరసరావుపేట, 522601

గుంటూరుజిల్లా (ఆం. ప్ర.)

ముద్రణ:

విశ్వశ్రీ ఆర్ట్ ప్రెస్,

నరసరావుపేట

# విషయసూచిక

# అంకితం

గాంధీమహాత్ముని అనుచరులును, అఖిల భారత హరిజన సేవక్ సంఘాధ్యక్షులుగ హరిజనులకు, గిరిజనులకు ఎంతో కృషి సలిపిన, ఆదిమవాసుల సేవకు నన్నెంతో ప్రోత్సహించిన

## శ్రీ ఠక్కర్ బాపా గారికి

భారతీయ ఆదిమజాతి సేవక్ సంఘాధ్యక్షులును, భారతీయ ఘుమంతు జన (సంచారజాతుల) సేవక్‌సంఘ స్థాపకులును, ఆదర్శపురుషులును, పూజనీయులును అగు

## శ్రీ మొరార్జీ దేశాయి గారికి

ఆంధ్రప్రదేశ్ ఆదిమ జాతి సేవక్ సంఘాధ్యక్షులును, ఆదిమవాసులకు చిరస్మరణీయమైన సేవచేసినదేశభక్తులు, ఈ ఉద్యమములో నాకు గురుతుల్యులును అగు

## శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారికి

ఈ త్రిమూర్తులకు

నా ఈ గ్రంధమును సభక్తికంగా సమర్పిస్తున్నాను.

ఇట్లు,

చిత్తాపూరు నాగభూషణాచార్యులు

గ్రంధకర్త

# పరిచయము

సంచారజాతులు ఆదిమవాసులలో ఒకవర్గమై వున్నారు. నేటి కాలమాన పరిస్థితుల దృష్ట్యా వీరు దీనాతిదీనులే. కాని వీరు అనాగరికులు కారు. పూర్వాచార సంప్రదాయవిశేషములు, ఎన్నో మంచి లక్షణములు ఇంకను వీరిలో నిలిచియున్నవి. ఈ సలక్షణములను నిలుపుచు వీరిని తదితర స్వదేశస్థులతో సమానమగు అభివృద్ధిని కలిగించి సామాన్య ప్రజావాణిలో ఒకరిగా చేయుట అందరి కర్తవ్యమై యున్నది. ఇందుకు ప్రభుత్వము సర్వదా ఆలోచన చేయుచున్నది. వీరి యోగక్షేమములకు వలయు యేర్పాట్లు యెప్పటి కప్పుడు కావించుచునేయున్నది.

సంచారజాతులను స్వదేశీయులందరు అప్పుడప్పుడు చూచుచునేయుందురు. కాని వీరిగురించి వారికి తెలియదనే చెప్పవలసియున్నది. ఎందువలనన ఈ జాతులవారు స్వదేశీయులతో కలిసిమెలిసి తిరుగుటకు సుముఖులు కారు. పైగా వీరు యెక్కువకాలము ఒకచోట వుండుటకు యిష్టపడక యెప్పటి కప్పుడు ప్రదేశములను మార్చుచుండుటచే స్వదేశీయులకు వారినిగురించి తెలిసికొనుటకు వీలుపడి యుండదు. కాని స్వదేశీయులు ఈ జాతుల గురించి తెలిసికొని వీరి అభివృద్ధికి తోడ్పడినపుడే స్వతంత్ర భారతావనిలో వీరి పునరావాసానికి వీలు యేర్పడ కలదు.

ఇట్టి తరుణములో శ్రీ చిట్టావూరు నాగభూషణాచార్యులుగారు 'సంచార జాతులు' పుస్తకము వెలువరించుట చాల సమంజసముగా వున్నది. ఈ పుస్తకములో గ్రంధకర్త కొన్ని సంచారజాతుల వివరములు తెలియజేసి, ప్రభుత్వము యింతవరకు వారి అభివృద్ధికి చేసిన పథకములను తెలియజేస్తూ, యింకా వారి అభివృద్ధికి యేమిచేయవలెనో సూచనలతో వివరించిరి. ఎంతో కృషిచేసి పరిశోధన సల్పితేకాని యిటువంటి పుస్తకమును వెలువరించుట చాలకష్టము. ఈ కార్యక్రమములో కృతకృత్యులైనందుకు శ్రీ ఆచార్యులవారికి నా హృదయపూర్వక అభినందనలు.

తెలుగుభాషలో యిటువంటి పుస్తకములు చాల అరుదుగానున్న తరుణంలో ప్రచురింపబడిన ఈపుస్తకమును సంచారజాతుల సంగతి సందర్భములు తెలిసికొన గోరువారేకాక తెలుగువారందరు తప్పక చదివి వుపయోగించుకుందురుగాక.

**భాట్టం శ్రీరామమూర్తి**
సాంకేతిక విద్య, గిరిజన సంక్షేమ మరియు యువజన
సంక్షేమ శాఖామాత్యులు

## కృతజ్ఞత

నిరంతరము ప్రజాసేవాకార్యక్రమములలో నిమగ్నులై యుండియు,

తీరిక చేసికొని, ఈ గ్రంథమునకు పరిచయము వ్రాసి పంపిన

ఆంధ్రప్రదేశ్ సాంకేతికవిద్య, గిరిజనసంక్షేమ మరియు

యువజనసంక్షేమ శాఖామాత్యులును, బహువిజ్ఞానవంతులును,

కార్యదీక్షాదక్షులును అగు గౌరవనీయులు

**శ్రీ భాట్టం శ్రీరామమూర్తి గారికి**

నా హృదయపూర్వకమగు కృతజ్ఞతను తెలియజేయుచున్నాను.

ఇట్లు

చిత్రాపూరు నాగభూషణాచార్యులు

గ్రంథకర్త

# ఈ గ్రంధముద్రణకు సాయపడిన మా కొణకంచి మిత్రులు



శ్రీ కొణకంచి వెంకటేశ్వరరావుగారు



శ్రీ కాకుమాను రామకోటేశ్వరరావుగారు

శ్రీ వకరికంటి
కృష్ణబ్రహ్మం
ఆర్యగారు



శ్రీ గుగ్గిళ్ళ రామనాధంగారు

శ్రీ వకరికంటి
వెంకటరామకృష్ణ
గారు



శ్రీ నలబోతు లక్ష్మీనరసింహారావుగారు



శ్రీ తూములూరి వీరావారిగారు

## ౬ - కృతజ్ఞత

స్టూవర్టుపురం సెటిల్‌మెంటులో ఎరుకలవారిమధ్య ఉద్యోగరీత్యా నివసించే
ం నాకు 1939_44 మధ్య లభించింది. వారి దైన్యస్థితి, పేదరికం, అనా
మూఢాచారాలు, దురలవాటులు, నిస్సహాయత కండ్లారా చూచియు,
గా తెలిసికొనియు ఎంతో బాధపడ్డాను. అమానుషమైన క్రిమినల్ ట్రైబ్స్
ప్రదమలులో ఉండేది. కనుక పోలీసులచేతులలో వారు పడే యమయాత
హాస్తే కడుపు తరుక్కుపోయేది. ఈ దుర్భరదృశ్యాలే నన్నీ జాతులగురించి
టానికిగాని, వారికి అల్పంగానైనా సేవచేయటానికిగాని పురికొల్పినవి.

సెటిల్‌మెంటులో నాఉద్యోగబాధ్యతలను నిర్వర్తించుచు, తీరికవేళల వీరిని
తెలిసికొనేవాడిని, ఆలోచించేవాడిని, వీలుకలిగినపుడల్లా, మద్రాసువెళ్ళి
మెంటుపైఅధికారులగు లేబరుకమీషనర్లను స్వయంగా చూచి వీరి స్థితి
ను వివరించేవాడిని. అప్పట్లో లేబరుకమీషనర్లుగా పనిచేసిన శ్రీ రూథర్
C. S. శ్రీ వి. రామకృష్ణ I. C. S. మున్నగు వారితోను, మాతాలూకా
ం, మాకు అత్యంత సన్నిహితులగు పూజ్యులు శ్రీ అయ్యదేవర కాళేశ్వర
ంతులుగారితోను (చీఫ్ పార్లమెంటరీ సెక్రటరీ) నాకు తెలిసిన శాసన
తోను, పెద్దలు శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారితోను (పార్లమెంటరీ
ంరీ) అనేకసార్లు వివరించి చర్చించడం జరిగింది. గుంటూరు తరచువెళ్ళి
క్త శ్రీ కొండా వెంకటప్పయ్యపంతులుగారిని కలిసికొనేవాడిని. వారిద్వారా
మహాత్ముని ముఖ్యానుచరులును, హరిజన గిరిజన సంక్షేమంకొరకు ప్రత్యే
పాటుపడుచున్న దీనజనబాంధవుడు శ్రీ ఠక్కర్‌బాపాగారితో పరిచయం
ం లభించింది.

మొదట్లో, ఈ విషయంలో నేను ఏకాకిననే చెప్పాలి. ఎరుకలవారు నాదగ్గ
రావడానికి, నాతో మాట్లాడటానికి భయపడేవారు. అవి బ్రిటిష్ ప్రభుత్వ
లు. సెటిల్‌మెంటును ఆంగ్లేయులగు శాల్వేషన్ అర్మీ వారు పరిపాలించేవారు.
బెదరింపులు, అడ్డంకులు, ఇబ్బందులు ఎదుర్కొనవలసివచ్చినది. సెటిల్
ం నివాసి, యువకుడు అగు శ్రీ రామేశ్వరం నాగయ్యగారు ఎట్లో సాహసించి
పరిచయం చేసికొన్నారు. ఆయనకు ఐ. యల్. టి. డి. కంపెనీలో ఒక
ఉద్యోగం ఉండేది. దానికి రాజీనామాచేసి సంఘసేవకొరకు పూరికాలం
పడటానికి ఆయన సిద్ధపడెను. ఆయన త్యాగం వేనోళ్ల పొగడతగినది. శ్రీ
ర్‌బాపాగారితో చెప్పి స్వల్ప వేతనంతో వారిని ప్రచారకునిగ నియమించడం
ంది. తరువాత క్రమక్రమంగా మా ఉద్యమం సెటిల్‌మెంటులోను బయటను
మంది ఎరుకల యువకులను ఆకర్షించింది.

సెటిల్‌మెంటు అధికారుల ప్రతిబంధకం ఒకవైపు, పోలీసుల బెడద మరి
వైపు, శాల్వేషన్ ఆర్మీవారి చెప్పుచేతులలో గల సెటిల్‌మెంటు వాసుల
రేకత ఇంకొకవైపు, ఇన్నిటిమధ్య, దేనికైనను సాహసించి, మా ప్రచారం

సెటిల్‌మెంటులోను, జిల్లాలలోను ముమ్మరంగా సాగించాము. 'ఎరుకల' పత్రికను పెట్టి కొన్నాళ్ళు నడిపాము. ఆంధ్రరాష్ట్ర ఎరుకల సంఘమును స్థాపించి రిజిష్టరు చేశాము. ప్రథమ ఎరుకల మహాసభను గుంటూరులో ఎన్నోకష్టాలమధ్య జయప్రదంగా జరిపాము. తరువాత అనేక సభలు సమావేశాలు జరిపాము.

ఈ ఉద్యమం నానాటికి విస్తరించింది. రాష్ట్రవ్యాప్తంగా ఎరుకలవారిలో పూర్తి సంచలనం కలిగించింది. క్రిమినల్ ట్రైబ్స్ ఆక్టు రద్దుచేయబడింది. ఎరుకలవారు షెడ్యూల్డు ట్రైబ్స్‌లో చేర్చబడినారు. కొందరు విద్యాధికులైనారు. ఉద్యోగులసంఖ్య పెరిగింది. వీరికి ప్రత్యేకంగా హాస్టళ్లు ఏర్పడినవి. కొంతమంది శాసనసభ్యులైనారు. వీరి అభివృద్ధికి మార్గాలేర్పడినవి.

సెటిల్‌మెంటువదలినను, నేను ఏఉద్యోగంచేసినను, వీరి సమస్యలయెడల, వీరి చరిత్రయెడల, వీరి సేవయెడల ఆసక్తిని చూపుతునే ఉన్నాను. అక్కడక్కడ వీరికి ప్రత్యేకంగా పూర్తిగా ప్రజల సహకారంతో కాలనీలు ఏర్పాటుచేయడం జరిగింది. ఆదిమవాసులకు ప్రత్యేకంగా వేసంగి పాఠశాలలు నిర్వహించడం జరిగింది. ''ఆదిమవాసులు'' అను గ్రంథం తెలుగులో వ్రాసి ప్రకటించాను. ఈ గ్రంథానికి పూజ్యులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు పీఠికవ్రాసి ప్రశంసించారు. కొన్ని వీరి సభలలో, సదస్సులలో పాల్గొన్నాను. ఇప్పుడు ''సంచారజాతులు'' అను గ్రంథము వ్రాసి ప్రకటిస్తున్నాను.

ఈగ్రంథరచనకు ప్రోత్సహించినవారిలో కృష్ణాజిల్లా కాంగ్రెసు అధ్యక్షులు నాకు ఆప్తమిత్రులు శ్రీ రేపాల బుచ్చిరామశేషయ్యశ్రేష్ఠిగారు, గుంటూరుజిల్లా గ్రంథాలయసంస్థ అధ్యక్షులు నాకు ముఖ్య మిత్రులు. శ్రీ యన్నం వెంకటనర్స రెడ్డిగారు, ప్రముఖ గ్రంథరచయిత, నాకు ఆబాల్యమిత్రులు శ్రీ కొణకంచి వెంకటేశ్వరరావుగారు, ఆంధ్రరాష్ట్ర ఆదిమజాతిసేవక్ సంఘాధ్యక్షులు, నాకీ ఉద్యమంలో చాలకాలం నుండి సహచరులు శ్రీ పాలపర్తి వీరయ్యగారు కలరు.

ఈగ్రంథప్రకటనకు సాయపడినవారిలో నా జన్మస్థానమైన కొణకంచివాస్తవ్యులగు సర్వశ్రీ కొణకంచి వెంకటేశ్వరరావు, కాకుమాను రామకోటేశ్వరరావు, తూములూరి వీరాచారి, గుగ్గిళ్ళ రామనాథం, నలబోతు లక్ష్మీనరసింహారావు, నకరకంటి కృష్ణబ్రహ్మంఆర్య, వారి సోదరులు వెంకటరామకృష్ణ, శ్రద్ధతో ముద్రణ చేసిన విశ్వశ్రీ ఆర్టు ప్రెస్ ఫోర్‌మన్ శ్రీ షేక్ ఖాదర్‌మస్తాన్ కలరు.

ఈ గ్రంథ విషయసేకరణకు తోడ్పడినవారిలో మా కుటుంబసభ్యులుకాక, గుంటూరుజిల్లా గ్రంథాలయసంస్థ కేంద్ర గ్రంథాలయ డిప్యూటీ లైబ్రేరియన్, విజ్ఞానిమైన శ్రీ అళ్ళ రాఘవయ్యగారు కలరు. నేను కోరినంతనే సికిందరాబాదు వాస్తవ్యులు ప్రముఖ చిత్రకారులు, కవులు శ్రీ మడిపడిగ బలరామాచార్యులువారు సందర్భోచితంగా ముఖచిత్రం చిత్రీకరించి పంపియున్నారు.

వీరందరికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

పింగళ, శ్రావణపౌర్ణమి
ది 28-8-77

చిట్టాపూరు నాగభూషణాచార్యులు
గ్రంథకర్త

# 1. సంచారజాతులు ఎవరు?

'నేడు ఇక్కడ, రేపు ఎక్కడో' అన్నట్లుగా నిరంతరం తిరిగే కొన్ని జాతులవారిని మనం ఇప్పటికికీ చూస్తూనే ఉన్నాము. వీరికి నిలువ నీడలేదు, 'నా' అనేది ఏమి ఉండదు. నిరంతరం దరిద్రంతో కృంగి కృశించేవారు వీరు. ఎండనక, వాననక, తిరుగుతునే ఉండుట వీరికి అలవాటు. గమ్యం స్థానం అంటూ వీరికి లేదు. ఎక్కడికో, ఎందులకో, ఎప్పుడో అను ప్రశ్నలకు వీరి నుండి సమాధానం ఉండదు. ఆదర్శాలు లేవు, ఆశయాలు ఉండవు. ఇటుల దేశాటనం చేసే మానవులు ఇప్పటికి లక్షలకొలది మనదేశంలో ఉన్నారు. మన దేశంలోనే కాదు, ప్రపంచంలోని అనేకదేశాలలోకూడ ఉన్నారు.

దేశదిమ్మరితనం ఈనాటిది కాదని మానుష శాస్త్రవేత్తలు తెలుపుతున్నారు. ముప్పయిలక్షల సంవత్సరాల మానవ జీవిత పథంలో ఇది మొదటి మెట్టు. 'తన ఇల్లు, తన పొలము, తన ఊరు, తన ఆలు బిడ్డలు, తన బంధువులు' అని అనుకోని వీరికి తన దేశమనికాని, తన జాతియనికాని, తన సంఘమనికాని ఆలోచనలు తట్టి ఉండవు. 'తన' అన్న భావాన్నే ఎరుగని వారికి 'మన' అన్న ఆలోచన స్ఫురించడానికి లక్షలకొలది సంవత్సరాలు పట్టియుండవలెను. మానవజీవితముయొక్క మొదటి దశ సమిష్టి జీవనమే అని వాదించేవారు లేకపోలేదు. ఇది వాస్తవం కాదని మానుషశాస్త్ర పరిశోధకులనేకులు ఋజువు చేసియున్నారు.

మానవులు 'కట్టు'కున్న భార్యలను మొదట ఎరుగరు. ఏర్పాటు చేసికొన్న సంసారాలు అసలే లేవు. అసలు 'కట్టు'కోవడము అనే భావం వీరికి లక్షలకొలది సంవత్సరాల క్రితం లేనేలేదు. ఇది కొన్ని వేల సంవత్సరాల క్రితం ఆలోచన మాత్రమే. సంపూర్ణ స్వాతంత్ర్యం అనుభవించిన మానవుడు 'కటు'కొనుటలో గల బంధానికి మొట్టమొదట సమ్మతించి ఉండడు. ప్రేమబంధము స్త్రీపురుషులను

కలిపి ఉండవచ్చు. సంతానోత్పత్తితోకూడ సంసారబంధం బలవంతంగా ఏర్పడి ఉండవచ్చు. ఆపైన బంధువర్గం, జాతిబంధం, గ్రామబంధం, రాజ్యబంధం.... ఈవిధంగా మానవుడు కాలక్రమేణ తన స్వాతంత్ర్యాన్ని క్రమంగా తగ్గించుకుంటూ, సంఘముయొక్క కట్టుబాట్లకు బానిసయై ఉండవచ్చు. నాగరికత హెచ్చే కొలది, ఆశ పెరిగేకొలది సంఘబంధం, మతబంధం, దేశబంధం, భక్తిబంధం, మానవకోటియొక్క మనస్సులను మార్చివేసి ఉండవచ్చు. మానవ ప్రకృతిలో కలిగిన ఈమార్పు మేలుకా, కీడుకా అని చెప్పుట కష్టము.

ఆదిలో ఆశ అనేది మానవుడిలో లేదు. దురాశకు అవకాశమే లేదు. ఏనాటికి కావలసిన ఆహారాన్ని ఆనాడు సేకరించుకొని పొట్ట నింపుకునేవారు. 'రేపు' అన్నమాటను ఎరుగని వీరు 'కూడపెట్టు'కొనే ప్రసక్తి లేదు. ఆశలేనితనం ప్రతి ఆదిమవాసుని ముఖ్య చిహ్నం. దేశద్రిమ్మరితనం అట్టి మానవుల మూల లక్షణం. ఆశలేనివారికి ఆస్తిపాస్తులు అనవసరం. ఆస్తిలేనివానికి ఆశ్రయ ముండవలసిన అవసరం లేదు.

నాగరికత పెరిగినకొలది కొందరు అనేక మార్గాలవలన ధనవంతులైరి. చాలమంది నిరుపేదలుగనే నిలిచిపోయిరి. అప్పుడే 'బానిస వ్యాపారం' ప్రారంభమై ఉండవచ్చు. మన పురాణాలలోని 'దాస దాసీ జనంబులు' ఈకోవకు చెందినవారే. ఈ బానిసల అమ్మక వ్యాపారం 1855 వరకు కొనసాగుచునే యున్నదని చరిత్రకారులు వ్రాసియున్నారు. ఇది క్రమంగా తగ్గిపోయినది.

ఇల్లు, వాకిలి, భార్య, బిడ్డలు, గొడ్డు, గోద మొదలగువాటిని సమకూర్చుకొనుటకు దేశద్రిమ్మరితనం ప్రబలమైన అంతరాయమని కొందరి అభిప్రాయం. కాని స్థిరాస్తి సంపాదనకుమాత్రమే ఇది గొప్ప అభ్యంతరం కావచ్చు. బాగుపడదామన్న సంకల్పమే ఆస్తి సంపాదనకు ముఖ్య కారణము. ఇట్టి సంకల్పము ఎప్పటికప్పుడు పొట్టనింపుకుందామనే ద్రిమ్మరికి సులువుగా కలుగదు. కలిగేవరకు అతడికి ఆస్తి సమకూడదు. ఏదోవిధంగా ఆస్తిచేకూరితే తిరిగే స్వభావానికి అతను స్వస్తి చెప్పవచ్చు. ఈమార్పు ఒక్కొక్కజాతిలో వేలకొలది, లక్షలకొలది సంవత్సరాల పర్యంతం జరుగక పోవచ్చు. మనస్సుయొక్క పరిపక్వమే మానవజాతియొక్క వికాసానికి మూలకారణం.

మానుష శాస్త్రవేత్తలు ఆదిమవాసులను మూడుభాగాలుగా వర్గీకరించి యున్నారు. 1. ఆదిమజాతులు 2. నేరపుజాతులు 3. సంచారజాతులు. వీరిని గురించి పరిశోధనలు అనేకం జరిగినవి. నేటికిని జరుగుచున్నవి.

ఆదిమజాతులు:— వీరిని ఇటీవల షెడ్యూల్డు ట్రైబ్స్ అనికూడ పిలుచు చున్నారు. వీరు ఎక్కువ కొండలలోను, కోనలలోను నివసించుచున్నారు. ఇందు ముఖ్యంగా రాజస్థాన్‌లోని భిల్స్, ఛోటానాగపూరులోని శంతాలులు, అస్సాము లోని నాగజాతి, ఆంధ్రప్రదేశ్‌లోని గోండు, కోయ మున్నగువారు కలరు. ఉదా హరణకు మాత్రమే వీరి నిచట పేర్కొనబడినది. ఇట్టి వీరు వివిధపేర్లతో పిలువ బడు కొన్నివందలమంది కలరు. వీరినిగురించి లోగడ నాచే రచింపబడిన "ఆదిమ వాసులు" అను గ్రంధంలో వివరించడమైనది.

నేరపుజాతులు:— వీరు ఎక్కువ మన మధ్యనే నివసించుచుందురు. కాని దూరంగా ఉండుటకు ప్రయత్నింతురు. వీరు ఇతర వృత్తులు చేయుచునేఉన్నారు. నేరపు ప్రవృత్తి ఇంకను వీరిలో కలదు. కంజార్, సాన్సి, డోమ్, పాసి, ఎరు కల మున్నగువారు వీరిలో కలరు. వీరిలో కొందరిని షెడ్యూల్డు ట్రైబ్స్‌లోను, కొందరిని విముక్తిజాతులలోను చేర్చియున్నారు. వీరిలో చాలవరకు మార్పు వచ్చి నది. ఇంకను రావలసియున్నది. వీరినిగురించి కూడ కొంతవరకు నా "ఆదిమ వాసులు" అను గ్రంధంలో వ్రాయబడియున్నది.

సంచారజాతులు:— వీరికి స్థిర నివాసము లేదు. నిరంతరము తిరుగుచుం దురు. కనుకనే సంచారజాతులని పిలువబడుచున్నారు. వీరిని గురించియే మనం ప్రస్తుతం తెలిసికొనవలసియున్నది. ఇతర ఆదిమవాసులతో పోల్చి చూచినపుడు వీరి స్థితి చాల దయనీయమైనది.

సంచారజాతులకు ఆంగ్లంలో 'నొమాడ్' (Nomad) అంటారు. ఇది గ్రీకుపదం 'నోమో' నుంచి ఆవిర్భవించింది. వీరు భారతదేశంలో 50 లక్షల వరకు ఉండవచ్చునని ప్రభుత్వంచే నియమింపబడిన సంచారజాతుల విచారణ కమిటీవారు అభిప్రాయపడియున్నారు. వీరు అని రాష్ట్రాలలోను ఉన్నారు.

వీరిది ప్రత్యేకమైన మనస్తత్వం. వీరిలో రంగు, జాతి, మత, కులభేదాలు లేవు. దేశ కాలపరిస్థితులు వీరికి అడ్డురావు. వీరికి ప్రత్యేకాభిమానాలు లేవు. దురభిమానాలు అంతకంటె లేవు. వారి పొలిమేరకు సరిహద్దులు లేవు. తిరుగుతుండడమే వారి పని. అదేమోకాని వీరు పలుకరించినను పలుకరు. సంఘం వీరిని వెలివేసింది. వీరూ సంఘాన్ని వెలివేశారని కూడ చెప్పవచ్చు.

## వీరి ముఖ్య లక్షణాలు :—

మానుష శాస్త్రజ్ఞులు సంచారజాతుల ముఖ్య లక్షణములను ఈ క్రింది విధంగా వివరించిరి.

(1) వీరికి 'ఆశ' అనునది లేదు. ఆశయాలు అంతకంటె లేవు. ఇది సంచార జాతులలో ప్రధాన సాంస్కృతిక లక్షణము.

(2) దేశద్రిమ్మరితనం వీరి జాతిలక్షణం. ఇది వ్యక్తి లక్షణంకాదు. సామూహిక లక్షణమనే చెప్పవచ్చును.

(3) వీరిలో 'సిగ్గు' జాస్తి. సాధారణంగా ఇతరులతో మాట్లాడరు. తామేదో తక్కువ అనే భావం వీరిలో ఉండవచ్చును. లేక ఇతరులను చూస్తే భయంవలనకూడ వీరిట్లు ప్రవర్తించవచ్చును.

(4) పిరికితనము వీరిలో కొట్టవచ్చినట్లు కనపడును. ఇది భీరుత్వమువలన కాదు. భయంవలన కావచ్చు. లేక వినమ్రతను సూచించే లక్షణం కావచ్చు.

(5) జాతి చైతన్యము లేక సామూహిక పరిజ్ఞానము (Community feeling) వీరిలో లోపించియున్నది.

(6) వీరిలో ఆరుబయట నివసించు ఆసక్తి మెండు. నిరంతరము సంచారము చేయుదురు. గనుక వీరికి ఈ అలవాటు అబ్బియుండవచ్చును. కాయకష్టము చేయుట కలవాటుపడినారు. ఎండకు, వానకు, చలికి అన్నివిధములైన శీతోష్ణస్థితికి తట్టుకొను శక్తి వీరిలోకలదు.

(7) కృత్రిమవేషధారణకు వీరు పూర్తి వ్యతిరేకులు. ఆభరణములు ధరించరు. వస్త్రధారణ ఎంతవరకు అవసరమో అంతవరకే ఉంచుకొనెదరు. శరీరంలో

ఎక్కువభాగం నగ్నంగా ఉండును. సహజ సౌందర్యమే వారికి అందము ఆనందమును కలుగజేయును.

(8) తిరుగుబోతుతనముపై వీరికి ఇచ్ఛమెండు. నిరంతరము తిరుగకున్నచో వీరికి తోచదు.

(9) కాలము విలువ తెలియదు. డబ్బుయొక్క విలువ అంతకంటె తెలియదు. సంపాదించినది ఖర్చుపెట్టునంత వరకు వారు నిద్రబోరు. తిరిగేవానికి డబ్బు దాచుకొను అవకాశం లేదు. కనుక ఇది వారి ప్రవృత్తికి అనుగుణంగానే ఉన్నది.

(10) నిర్ణీత కాలములో పనిచేయుట వారికి సుతరాము ఇష్టము లేదు. ఇష్టమొచ్చినపుడు పనిచేస్తారు. లేనపుడు కులాసాగా తిరుగుతారు. ఇంచుమించు స్వేచ్ఛాజీవులు వారు.

(11) వారు అలవాటుపడిన పని తప్ప క్రొత్తపని చేయడానికి ముందుకు రారు. ఆహారంలో మార్పు వారికి గిట్టదు. క్రొత్తవారితో పరిచయానికి వారు ఇచ్ఛగించరు.

(12) వీరిని అనుమాన పిశాచము వెంటాడుతునే ఉండును. ఆత్మీయులను తప్ప ఇతరులను అనుమానిస్తుంటారు.

(13) వీరు మూలికావైద్యం తప్ప ఇతర మందులు వాడుటకు అంగీకరించరు. అన్నిటికంటె 'లంకణం పరమౌషధం' అని ఉపవాసం వలననే అన్ని రోగములు కుదరగలవనే విశ్వాసం వీరికి పూర్తిగా కలదు.

(14) కష్టపడి పని చేస్తారు. వీలున్నపుడు విశ్రాంతి తీసికొనుట వీరికి అలవాటు. తినటానికి ఉంటే, పని చేయుటకు బద్ధకింతురు.

(15) కొన్ని కుటుంబములు కలిసితిరుగుట వీరికి అలవాటు లేదు. ఒక కుటుంబమునకు సంబంధించినవారే అరుదుగా కలిసికొందురు.

(16) వారు ఎప్పుడు తిరుగుతుంటారు గనుక వారికున్న వస్తువులు బహు పరిమితము. మోసికొని పోవుటకు వీలగు సామాను మాత్రమే ఉండును.

(17) పదిహేను మైళ్లలోపు వీరు మకాం చేయరు. చెట్లక్రిందనే వారి నివాసము. కావడిలో సామానుమోసికొనిపోవుదురు. వండుకొనుటకు అవసరమైన కుండ

సామాను, అవసరమైన గుడ్డలు, కొద్దిగా ధాన్యము, కోళ్ళు, మోయుటకు ఒక గాడిద, కాపలాకు కుక్క మాత్రము వీరివెంట ఉ

(18) ఉత్తర హిందూస్థానంలో 'కార్వారులు' అనే జాతివారు మాత్రం 200 300 వరకు కుటుంబములు సమిష్టిగా తిరుగుచుందురు. వీరికి స్త్రీలే కులు. వీరిని 'ముఖ్యులు' అందురు.

(19) సంచారజాతులలో నీతి నిజాయితీలు కలవు. చిత్తశుద్ధి కలవారు. పనిచేస్తారు. ఎప్పుడు సంతోషంగా కాలం గడుపుతారు.

(20) పురాతన ఆయుధాలగు కత్తులు, కఠారులు, బల్లేలు, బాణాలు ఎకు వీరు ఉపయోగించెదరు. క్రూరమృగాలను సైతం ధైర్యంగా ఎదు చంపగలరు. కొండలను సులభంగా ఎక్కగలరు.

(21) వీరిలో కొందరు పూర్తిగా సంచారజాతులు కారు. ఒక్కొక్కచోట ఎ కాలము నివసించెదరు. వీరి సమస్యలను, తగాదాలను, వారి కుల వలన తీర్చుకొనెదరు. వీరికి కొన్ని నిర్దుష్టమైన కులాచారాలు కలవు. తగాదాల పరిష్కారము ఒక్కొక్కప్పుడు చాలాకాలం పట్టును. కఠిన విధించెదరు. అప్పీళ్లు ఉండవు. వీరై వీరు సృష్టించుకొనిన "కోర్ట ఈ పద్ధతిలో జరుగును.

## ఆహారపు అలవాట్లు :—

వీరి ఆహారపు అలవాట్లు వీరి సంచార ప్రవృత్తి ననుసరించియే యుండ 'రేపు' అనే ఆలోచన వీరికి లేదు కనుక వారికి తినుటకు అనువగునది దొరికి దెల్ల తినినంత తిని పారవేయుటే వీరికి అలవాటు. వేటాడి ఆహారము సంపాది కొనుట వీరికి బాగా తెలియును. దొరికిన పండ్లు తినెదరు. వీరిలో కొందరు చే పట్టి తినెదరు. పక్షులను, కోతులను కూడ చంపి తినెదరు. పచ్చిమాంసవ ఎక్కువ తినుటకు అలవాటుపడిరి. వేటాడే స్వభావంగల సంచారజాతులు ఆ రావికై ఒక్కొక్కచోట వారం పదిరోజులు మకాం చేస్తుంటారు. తాత్కా గుడిసెలు వేసికొని నివసిస్తుంటారు. అక్కడ వేట పూర్తియైన వెంటనే ఇం చోటుకు మారుతూ ఉంటారు.

## వీరిలో వివాహాలు :—

వీరిలో వివాహ నిర్ణయం ఒక ప్రత్యేక పద్ధతిలో జరుగును. కాబోయే అల్లుడు తన బలాన్ని, ప్రజ్ఞను మామగారి ముందు నిరూపించుకోవలసియున్నది. తనకు కాబోయే అల్లుడు భార్యను పోషించి సాకగల సమర్థుడని నమ్మకము తోచి ననేగాని తను కూతురిని అతనికి యిచ్చుటకు అంగీకరించడు. ఇందుకు వేట ప్రధానమగు పరీక్ష. బలప్రదర్శనము ముందుగా చూపి నెగ్గవలసియున్నది. హిందూ పురాణములలో కూడ ఈ పద్ధతి కలదు, శ్రీరాముడు విల్లును ఎక్కుపెట్టి తన శక్తిని ప్రదర్శించినగాని సీతను చేపట్టుటకు అవకాశం కలుగలేదు కదా! ద్రౌపదీ స్వయంవరంకూడ మత్స్యయంత్రము పరీక్ష వలననే జరిగినది కదా! మామగారు పెట్టిన పరీక్షలో నెగ్గిననేగాని వీరికి వివాహాలు జరిగేవికావు. హైందవ ప్రాచీన ఆచారములను కొన్ని ఇప్పటికినీ వీరిలో మనం చూడవచ్చు.

## శిశు హత్యలు ;—

వీరిలో శిశు హత్యాచారం ఉండేది. ఇది చాల దారుణం. ఎక్కువగా ఆడ పిల్లలు పుట్టితే, వారిని పుట్టినపుడే అంతమొందించే అలవాటు వీరిలో కలదు. ఆడశిశువులపై వీరికి విముఖత ఎక్కువఉండేది. వీరు ఎప్పుడూ తిరుగుతుండెదరు గనుక, కుటుంబంలో ఎక్కువ జనసంఖ్య ఉండడం వీరు అసౌఖ్యంగా భావించి అంతమొందించేవారు. ఇది ఒకవిధంగా ఇప్పుడు అమలులోనున్న కుటుంబ నియంత్రణ లాంటిదే కావచ్చును. కాని అది అమలుజరుపు పద్ధతి చాల భయంకర మైనది. శిశుహత్యలు మన ప్రాచీనపురాణగాథలులో కూడ కలవు. శంతనుడంతటి మహారాజు గంగతో చేసికొన్న ఒడంబడిక ప్రకారం గంగాదేవి పుట్టిన బిడ్డను పుట్టినట్లు గంగలో పారవేసి శిశుహత్య చేయలేదా! చివరకు మగబిడ్డను సైతము నదిలో పడవేయుటకు సిద్ధపడగా శంతనుడు వారించటం, గంగాదేవి ఆమహారాజును శాశ్వతంగా వదలి వెళ్ళటం మనకు తెలిసిన పౌరాణికగాథ. వీటికి కారణము లేమైనను, శిశుహత్యలు అందు స్త్రీ శిశుహత్యలు ఆకాలంలో పరిపాటి కావచ్చును ఇదేకాక శిశుహత్యలు దేవుళ్లను తృప్తిపరచగలవనే మూఢ విశ్వాసం అప్పట్లో ఉండేది. ఇది ఇప్పటికిని సంచారజాతులలో కలదు. 70 సంవత్సరముల క్రితం

వరకు ఈ ఆచారం మనదేశంలో ఉండేదని చరిత్రకారులు వ్రాస్తున్నారు. పురంమహారాజా (ఒరిస్సా) హత్యచేసిన ప్రతిశిశువుకు లైసెన్సుఫీజు వ చేసేవారట. ఈహక్కును సంవత్సరానికి ఒకతూరు వేలం వేసి, అటుల వ డబ్బును సంస్థానానికి జమకట్టేవారట. బ్రిటీష్ ప్రభుత్వం ఈ దుష్టాచా రూపుమాపింది. ఆడశిశువులను మాత్రమే తుదముట్టించేవారి ఆచారానికి కా కొరకు వెతుక్కోనవసరం లేదు. ఇందువలన సంతానోత్పత్తి తగ్గి జవాభా గలదని వారి భావన. సంచారజాతులలో ఈ ఆచారం ఉండటానికి ఇ ప్రబలమైన కారణం ఉన్నది. నిరంతరం తిరిగే వీరు వారి తట్టలను, బు మోసికొని పోవుటయే ఒక సమస్యయైనపుడు, ఈ శిశువులను మోసికొనిపో వారికి దుర్భరమయ్యేది.

## నరమాంస భక్షణ :—

ఈ దుష్టాచారం ప్రపంచమంతా ఆదిమజాతులలో ఉన్నట్లు చరిత్రకా స్పష్టం చేస్తున్నారు. విరోధిని చంపి ఆ మాంసాన్ని తినుట ఒక వీరో కార్యంగా వారు భావించేవారు. కొన్ని జాతులలో వృద్ధులగు తల్లిదండ్రు మోసికొని పోలేక వారిని చంపి ఆ మాంసాన్ని తినే ఘోరాచారం కలదు. మాంసాన్ని తినడంవలన వారి గొప్ప గుణాలు వీరికి సంక్రమించగలవనే వ నమ్మకము వీరికుండేది. వేటాడుటకు మృగాలు కనబడనపుడు ఎస్కిమోలు లికి తట్టుకోలేక మనుష్యులను చంపి తినేవారని తెలియుచున్నది. మహాభారత వాతాపి, అతని సోదరుని కథ తెలియనివారుండరు. వారిరువురు నరమాంస ణకు అలవాటు పడినారు. ఇందుకై ఒక తంతు చేసేవారు. బాగా చదువుకొ పండితుని వారింటికి విందుకు ఆహ్వానించేవారు. వచ్చిన పండితునికి వా తన తమ్ముని మాంసముతో విందు చేసేవాడట. విందు అయిన తరువ వాతాపి తన తమ్ముని పేరుపెట్టి పిలువగనే అతను ఆ పండితుని పొట్టచీల్చుకొని వుడై బయటకు వచ్చేవాడట. చనిపోయిన పండితుని మాంసమును ఇద్దరు సో రులు తృప్తిగా ఆరగించి ఆనందించేవారట. ఈ సోదరులే అగస్త్య మహాము కూడ ఇట్టి విందు చేసినట్లు అందే కలదు. ఇటీవల వరకు కాశ్మీర్‌లో నరమా భక్షణ ఉండేదని చెప్పబడుచున్నది. చాలమంది ఆడపిల్లలను చంపి తినినందు ఒకరిని 1962 సం॥లో శ్రీనగర్ జడ్జి శిక్షించినట్లు వార్తపత్రికలలో పడినది. స్థితిలో సంచారజాతులలో ఈ ఆచారం ఉండుట ఆశ్చర్యం కాదు.

# 2. వివిధ సంచారజాతులు

ప్రపంచంలోగల సంచారజాతులను ఈ క్రింది అయిదు ప్రధాన భాగాలుగా విభజించవచ్చును.

(1) ఆహారాన్ని సమకూర్చుకొనే సంచారజాతులు

(2) పశువులను పెంచు సంచారజాతులు

(3) వ్యాపారరీత్యా లేక ఋతువుల ననుసరించి తిరుగు సంచారజాతులు

(4) నేరప్రవృత్తి గల సంచారజాతులు

(5) భిక్షుక వృత్తిచే జీవించు సంచారజాతులు

ఈ విభజన ఒకదానికి ఇంకొకదానికి సంబంధం లేనిది కాదు. వారిని మనం అర్థం చేసికొనుటకు మాత్రమే ఈ విభజన స్థూలంగా మానుషశాస్త్రవేత్తలు ఏర్పాటు చేసియున్నారు.

## ఆహారాన్ని సమకూర్చుకొనే సంచార జాతులు :—

మానవచరిత్రను పరిశీలిస్తే, మానవుడు జీవించుటకు ఎప్పుడును కష్టపడుచునేయున్నట్లు విదితమగుచున్నది. ఇది అనివార్యము. ఇది దేశ కాలపరిస్థితిని బట్టి మారుతునే యున్నది. ఆకులు అలములు దగ్గరనుండి ప్రారంభమై నాగరికత పెరిగినకొలది ఇది అనేక రూపములు దాల్చినది. కొంతకాలమైన తరువాత వేటాడుట ప్రధాన వృత్తియైనది. క్రమంగా వ్యవసాయం వచ్చింది. ఇప్పుడు పరిశ్రమలకు ప్రధానస్థానం లభించింది కదా! ఏదోవిధంగా పొట్టకై దేవులాడుట మానవుని ముఖ్యమైన పనియే!

'ఆహారాన్ని సమకూర్చుకొను సంచారజాతుల'నినపుడు వారికి ఇతరపనులు లేవనిగాని, చేయరనిగాని కాదు అది వారి ప్రధానవృత్తి అని తెలియజేయుటకు మాత్రమే వారట్లు పిలువబడుచున్నారు. వీరు ఆహారమును సమకూర్చుకొందురే

గాని పండించరు. అనగా వ్యవసాయం చేయువారు కారు. అందువలననే వీరిని సాంస్కృతిక సంచారజాతులని కూడ చెప్పవచ్చును తిరుగుబోతుతనం వారి సంస్కృతిలో విడదీయని ఒక ప్రధానభాగమైనది. తిరిగే స్వభావం వారి రక్త నాళాలలో జీర్ణించి యున్నది. దీనికి అంతులేదు, లక్ష్యమంతకంటె లేదు. వీరికి ఇతరులను దోచుకొనవలెననే దుష్టబుద్ధిలేదు. వీరికి ఆశలు లేవు. కనుక నిరాశలు లేవు. దరిద్రమన వీరికి తెలియనే తెలియదు. సంపద అన వీరికి అర్థముకాదు. ఎవరితోను ఎట్టి ఘర్షణ వీరు పెట్టుకోరు. ఆహారం సంపాదించుకొనే పనిలోనే వీరు నిమగ్నులైయుందురు.

మనదేశంలో కేరళలోను, ఆంధ్రప్రదేశ్‌లోను, బీహార్‌లోను ఈ విధమైన సంచారజాతులు కలరు. ఆస్ట్రేలియాలో వీరు విస్తారంగా కలరు. ఈ జాతిలో ఎస్కిమోలు ప్రపంచ ప్రసిద్ధి పొందినవారు. వీరు బేరింగ్ సముద్ర తీరాలలోను, యూకన్ నది దిగువభాగంలోను, కుస్కోలిన్ నదిలోయలోను ఎక్కువగా వున్నారు. (80° యన్. లాటిట్యూడ్‌లో)

వీరు మొత్తంమీద ఉదాత్తమైన స్వభావం కలవారు. పవిత్రమైన భావాలు కలవారు. అధ్యాత్మికచింతన వీరిలో కలదు. వీరికి సమస్యలే లేవు. ఒకవేళ ఉన్నను అవి ఇతరులచే కల్పింపబడినవే. వాటిని వీరు ఎదుర్కొనరు. తప్పించుకొని పారిపోవుదురు. డబ్బుకు కాని, కాలమునకు కాని విలువ ఇవ్వరు. దెయ్యాలన్నను, భూతాలన్నను వీరికి భయం లేదు. ఒంటరితనమునకు బాగా అలవాటు పడినవారు. అరణ్యాలను ప్రేమించెదరు. అందు నివసించెదరు. అందలి సృష్టిని ఆనందించెదరు. జంతువులనిన భయంలేదు. శీతోష్ణస్థితి మార్పులకు తట్టుకో గలరు. వారాలు, నెలలు, సంవత్సరాలు తెలియనే తెలియవు. వారి వయస్సు వారికి తెలియదు.

వీరి ఆధ్యాత్మికచింతన ఆశ్చర్యకరంగా ఉంటుంది. జీవితము దయ, ద్వేషము అను రెండు శక్తులచే నడుపబడుచున్నదని వారికి విశ్వాసము. గ్రామ దేవతల యందు వీరికి భక్తికలదు. హిందూ దేవతలగురించి వీరికి తెలియనే తెలియవు. భూమి, సూర్యుడు, నక్షత్రములపై భక్తికలదు. పునర్జన్మయందు

వీరికి నమ్మకము కలదు. చేసిన పాపాలకు శిక్ష అనుభవించవలెనని వీరికి తెలియును.

వీరు ఎత్తుగా ఉందురు. దృఢకాయులు, కష్టజీవులు. వీరు ఎక్కువ నగ్నంగా ఉందురు. కొద్ది తలపాగా ఉండును. వీరికి చదువుకొనవలెనను ఆసక్తి లేదు. పరిపాలన ఎట్లు జరుగుచున్నదో తెలియదు. ప్రభుత్వమేదో తెలియదు. వారిదొక ప్రత్యేక ప్రపంచం.

వారికి సంఘమన తెలియదు. సమిష్టి జీవనము వారికి క్రొత్త. భయంకరమైన అడవులలో కూడ వీరు నిర్భయంగా తిరుగగలరు. క్రూరజంతువులగు పెద్దపులులు, ఏనుగులమధ్యనే నివసించగలరు తాత్కాలికంగా వేసికొనిన గుడిసెలలో నివసించెదరు. ధైర్యము, నిర్భయము వారిని ఎల్లవేళల కాపాడుచునే ఉండును.

## పశువులను పెంచు సంచారజాతులు:-

ఆహారమును చేకూర్చుకొనుటకు మాత్రమే సంచారం చేసేజాతులు పశువులను పెంచే అలవాటువచ్చేవరకు కొన్నివందలసంవత్సరాలు పట్టియుండవచ్చునని మానుష శాస్త్రవేత్తల అంచనా. మొట్టమొదట తమ సామాను కాపలాకై కుక్కలను పెంచుటతో ఇది ప్రారంభమైయుండును, క్రమంగా గేదెలను, ఆవులను, మేకలను, గొఱ్ఱెలను పెంచుటకు వీరు అలవాటుపడి యుండవచ్చును. మనదేశంలో జంతుబలి అతిపురాతనమైన ఆచారం. వేదకాలములోను, పురాణయుగమునుండి, ఇటీవల మౌర్యులకాలంలో, అశోకుని పరిపాలనలో కూడ జంతుబలి ఉండేది. ఇప్పటికిని దేవతలను సంతృప్తిపరచుటకై జంతుబలులు గావింపబడుట లేదా ! జంతుబలులకే గాక, మాంసాహారమునకు, ప్రయాణ సౌకర్యాలకు కూడ వీటి అవసరము క్రమంగా ఎక్కువై యుండవచ్చును. నాగరికత పెరిగినకొలది, అవసరాలు హెచ్చినకొలది, పశువులను పెంచటం ఎక్కువైనది. వ్యవసాయం వరకు వచ్చేవరకు వీటి ఆవశ్యకత క్రమంగా బాగా పెరిగినది.

సంచారజాతులు సంబంధించి సంతవరకు కాపలాకు కుక్కలను, బరువు మోయుటకు గాడిదెలను, మాంసాహారమునకు తదితర జంతువులను తమ వెంట ఉంచుకొనుట ప్రారంభించిరి. క్రమంగా కొన్ని జాతులవారు పశువులను పెంచి వాటిని ఉపయోగించుకొనుటతో ప్రారంభమై, వ్యాపారము చేయువరకు వచ్చి యుండవచ్చును.

అమెరికాలోగల రెడ్ ఇండియన్స్‌లో నవాజో జాతివారు ఇట్టి జాతులకు చెందినవారే. మధ్య తూర్పుఆసియాలో ఈ తెగకు చెందిన సంచారజాతులున్నారు. పశ్చిమసిరియాలోను, తూర్పుఆఫ్రికా కొన్ని ప్రాంతాలలోను ఈ జాతివారున్నారు.

మనదేశంలో కాశ్మీర్, పంజాబ్, పశ్చిమ ఉత్తరప్రదేశ్, హిమాచల ప్రదేశ్, కొంతవరకు రాజస్థాన్‌లో వీరున్నారు. లడక్‌లోకూడ వీరు నివసిస్తు న్నారు. దక్షిణభారతంలో వీరి సంఖ్య చెప్పుకోదగినది. నీలగిరి కొండలలో గల తోడాలను గురించి ఒక విచిత్ర కథ కలదు. తోడాల సంపత్తిని వారికి గల పశు సంఖ్యనుబట్టి నిర్ణయించెదరు. ఒకపరి ప్రిన్స్ ఆఫ్ వేల్స్ ఆప్రాంతానికి వచ్చిన పుడు తోడాలను చూడాలని వారుండే ప్రదేశానికి వెళ్లారట. తోడాలు ఎంతసేప టికి బయటికి రాలేదు. వారికి నచ్చచెప్పడానికి వారి పరివారం ప్రయత్నించి తోడా లతో''రాజుగారు వచ్చినారనియు ఆయన చాల ధనవంతుడనియు, వారివెంట 200 మందివరకు పరివారం ఉన్నారని'' ఎంతో చెప్పారట. కాని తోడాలు ఒప్పుకోక "రాజుగారు భాగ్యవంతులైతే వారివెంట ఎన్నిపశువులు వచ్చినవి''అని అడిగారట.

1911 జనాభా లెక్కలప్రకారం మనదేశంలో వీరిసంఖ్య 51.76 లక్షలు 1931లో వీరిసంఖ్య 23.44 లక్షలకు తగ్గినది. వారి పశువులకు కావలసిన మేత, నీరు దొరికినంతవరకు ఒకచోట ఉండెదరు. దొరకనపుడు ఇంకోచోటుకు మారె దరు. ఏ సీజనులో ఎక్కడ పశువులకు మేత బాగా దొరుకునో వారికి తెలియును. దానినిబట్టి వారు సంచరించెదరు. తిరుగుతున్నపుడు పల్లెలలో పట్టణాలలో ధర వచ్చినపుడు పశువులను అమ్మెదరు, చౌకగా వచ్చినపుడు కొనెదరు కూడ.

## వ్యాపార సంచారజాతులు:-

హంగేరికి చెందిన 'జిప్సీలు' ప్రధానంగా పేర్కొనతగిన ఈ జాతివారు. వీరు ఈజిప్టు నుండి వచ్చినారని మొదట భావింపబడినది కాని తరువాత చరిత్ర పరిశోధనవలన ఇండియానుండి వీరు వలసవెళ్లినట్లు స్పష్టమైనది. వీరు చక్కగా పాడగలరు. వీరు పాడేపాటలు ఒక వెయ్యికి పైనే ఉన్నవని తెలియుచున్నది. వీరిని ఒకచోట స్థిరపరచుటకు అనేక ప్రయత్నములు చేయబడినవి, కొంతవరకు కృతార్థత చెందారుకూడా. వీరు యూరప్ అంతా, ముఖ్యంగా ఉత్తరఅమెరికాలో తిరుగుతూ ఉంటారు. వీరు గావించు నృత్య సంగీతములు అందరిని ఆకర్షించు చుండును. వీరు సువాసన ద్రవ్యాలు, నికిల్, వెండి వస్తువులు అమ్ముచుందురు.

వీరికి స్థిరనివాసము అలవాటు చేయుటకు ఇంగ్లండు, జర్మనీలోను, అర్జెంటైనాలోను, కెనడాలోను, యునైటెడ్ స్టేట్స్‌లోను, రష్యాలోను, ఇండియా లోను, అనేక ప్రయత్నాలు చేయబడినవి. చేయబడుచున్నవి ఉత్తరభారతంలో గోడియాలోహార్లు ఈ జాతికిచెందినవారు. వీరు ఉత్తరప్రదేశ్, బొంబాయి. పంజాబు. కాశ్మీరు, రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఢిల్లీ ప్రాంతంలో వీరు సంచారం చేస్తూ వారి వ్యాపారం సాగిస్తున్నారు. వీరు కమ్మరం, వడ్రంగంపని ఎక్కువగా చేస్తారు. చేసిన పనిముట్లను అమ్ముతుండెదరు. ఢిల్లీ అంతటి ప్రధాన నగరంలో కూడ రోడ్ల ప్రక్కన వీరు కొలిమినిపెట్టి వ్యవసాయ పనిముట్లను, తదితర వస్తువులను మరమ్మతు చేస్తూ ఉండడం మనం గమనించవచ్చును. వీరిని సంచార శిల్పులని అనినను అనవచ్చును. వీరు ఆదిలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన చిత్తూరు కోటకు సంబంధించిన వారని కొందరు చరిత్రకారులు వ్రాసియున్నారు. రాణా ప్రతాప్ మొగలుల చేతిలో ఓడిపోయినపుడు, ఆరోజు కోటను వీడి వెళ్లిపోయినపుడు, రాజభక్తిపరులైన లోహారులు రాజుతో కోటను వీడి తిరుగుతు తిరుగుతూ సంచారజాతుల క్రిందకు మారినారని తెలియుచున్నది. మొదట్లో వీరి సంస్కృతి గొప్పదియని వ్రాయబడినది. తిరుగుబోతుతనం వలన వీరు వారి నిష్ఠ, ఆచారాలను మరచి యుండవచ్చును. వీరు చాల తెలివిగలవారని కష్టపడి పని చేయగలరని ప్రతీతి. ఒక్కొక్కచోట పది పదిహేను రోజులుండి చుట్టుప్రక్కల వారికి వ్యవసాయపు పనిముట్లను బాగుచేసిపెట్టి వారిదగ్గరగల వ్యవసాయపు పని

ముట్లను అమ్మి అక్కడ పని పూర్తియైన తరువాత ఇంకొకచోటికి తరలుతూ ఉంటారు. వీరు రైతులకు ఎక్కువగా ఉపయోగపడే జాతివారు. వీరనిన రైతులకు ఎంతో ప్రేమ.

ఇరానీలు ఈ జాతికి చెందినవారే. వీరు ఎక్కువ పట్టణాలలో తిరుగుతూ, అద్దాలు, సుగంధ ద్రవ్యాలు మున్నగువాటిని అమ్ముతుండడం మనం చూస్తూనే ఉన్నాము. వీరు ఇరానీ, హిందీ, ఉర్దు మాట్లాడగలరు. అప్పుడప్పుడూ ఇంగ్లీషులో మాట్లాడుతూ మనలను ఆశ్చర్యపరుస్తూ ఉంటారు. వీరు ఇండియాకు ఎప్పుడు ఎట్లు వచ్చారో తెలియదు, వీరు దేశమంతా తిరుగుతూ ఉంటారు.

ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఈ జాతివారిలో పాములవాళ్లను చెప్పుకోవచ్చు. ఉత్తరహిందూస్థాన్‌లో వీరిని 'కాల్‌బెలియాస్' అందురు. వీరు పాములను పట్టుచూ, వాటిని ఆడిస్తూ, వాటి విషాన్ని అమ్ముతూ, అడుక్కొంటూ జీవిస్తూ ఉంటారు. వీరినిగురించి ఈ గ్రంథంలో ఇంకొకచోట ఎక్కువగా తెలిసికొనగలము. మనము చూచే గంగిరెద్దులవారుకూడ ఈ జాతికి చెందినవారే.

ఒరిస్సాలో 'షిట్టూరాలు' అను ఒక సంచారజాతి కలదు. వీరు నిరంతరం తిరుగుతూ, చిన్నచిన్న లాంతర్లు, చౌకబారు ఆభరణాలు గ్రామస్థులకు పనికి వచ్చే చిన్నచిన్నవస్తువులు చేసి అమ్ముతూఉంటారు. పంజాబ్‌లో 'ధియలు' అను ఒక సంచారజాతి కలదు. వీరు చినిగిపోయిన గుడ్డలను, చిత్తుకాగితాలను, ఎముకలను వీధులలో ఏరి అమ్ముతుంటారు. ఋతువుల ననుసరించి తిరిగే వారిలో గారోలు, మిరీలు, మికిరీలు, డిమ్యాకచేరీలు మున్నగువారు కలరు.

మహారాష్ట్ర ప్రభుత్వంవారు ఈ క్రిందివారిని సంచారజాతులక్రింద చేరుస్తూ ఉత్తరువులను జారీచేసింది. (ఆర్డరు నెం. యం. బి. సి. 3156/20/64-బి, ది 7-12-1956) వారిలో కొందరు బంజారీలు, చెల్దారులు, భండ, చెన్నదాసర, చమ్తాలు, దొంబరిలు, ఘిసాడీలు, కట్కారి, మున్నగు 40 జాతులవారు కలరు. కేరళలో ఉల్లదానులు, అల్లారులు, నాకురవనులు, జూనీలు, ఇరానీలు, మదారీలు మున్నగు 30 జాతులను సంచారజాతులక్రింద నిర్ణయించియున్నారు.

మధ్యప్రదేశ్‌లో నాటాలు, పర్ధిలు, కంజరాలు, బంజరాలు మున్నగు 40 జాతులను సంచారజాతులక్రింద ప్రకటించియున్నారు. తమిళనాడులో కాదారులు, ఇరులారులు, కురువనులు, దొంబరులు మున్నగు 15 జాతులను సంచారజాతుల క్రింద వర్గీకరించియున్నారు. కర్నాటకరాష్ట్రంలో బైరాగిలు, చలసంతులు, బుడబుక్కల, దొంబరి మున్నగు 50 జాతులను సంచారజాతులక్రింద చేర్చియు న్నారు. రాజస్థాన్‌లో బగ్రీలు, నాటాలు, భట్టులు, గోడియాలోహర్లు, ఇరానీలు మున్నగు 35 జాతులను సంచారజాతుల జాబితాలో చేర్చినారు. పశ్చిమబెంగాల్‌లో కాల్బిలియాలు, అగ్రియాలు, మదారీలు మున్నగు 20 జాతులను సంచారజాతుల క్రింద చేరుస్తూ ఉత్తరువులిచ్చియున్నారు. ఢిల్లీలో, గోడియాలోహర్లు, సాన్సీస్, కంజరులు, సిల్లిగారులను సంచారజాతులుగా పరిగణించియున్నారు. హిమాచల్ ప్రదేశ్‌లో జోగీలు, కాల్‌బలియాలు, బెంగాలీలు, మదార్‌సీస్, గోడియాలో హర్లు, బాజగర్లు, (ముస్లిములు) బవారియాలు (ముస్లిములు), ఇరానీలను సంచారజాతులక్రిందికి తెచ్చారు. త్రిపురలో హలానులు, చక్మాలులు, కూలేలు మున్నగు 15 జాతులను సంచారజాతులక్రింద జమ కట్టినారు. కాశ్మీర్ మరియు జమ్ము ప్రాంతంలో చంగ్పాలు అను సంచారజాతివారు రోడ్లు, రైలు సౌకర్యం లేని లడక్‌జిల్లాలో టిబెట్‌నుండి ఉప్పుతెచ్చి అమ్ముతుంటారు. వీరి జనాభా 3,000 దాకా ఉండునని అంచనావేయబడినది.

## నేరప్రవృత్తిగల సంచారజాతులు:-

మొఘల్ సామ్రాజ్యము అంతమొందిన తరువాత, ఈస్టుఇండియాకంపెనీ పరిపాలన ప్రారంభంలో దేశం చిన్నాభిన్నమయినది. ఎక్కడో అక్కడక్కడ పట్టణాలలో తప్ప పల్లెలలో పరిపాలన స్తంభించిపోయింది. వరుసగా జరిగిన యుద్ధాలవలన ప్రజలు భయభ్రాంతులైనారు. పంటలు సరిగ పండించలేకపోయి నారు. ఆహారసరకులు దొరుకుట దుర్లభమైనది. దొరికినను ధరలు విపరీతంగా పెరిగిపోయినవి. ఈ స్థితిలో దొంగలు, బందిపోటుదొంగలు చెలరేగిపోయినారు. ఈ అవకాశం తీసికొని నేరప్రవృత్తిగల సంచారజాతులు తమ కార్యకలాపాలను విస్తీర్ణంచేశారు.

బ్రిటీష్ ప్రభుత్వపరిపాలన ఏర్పడిన తరువాత వీరిని క్రిమినల్ట్రైబ్స్ చట్టంక్రింద చేర్చారు. (C. T. Act) వీరిపై నిఘాలు ఎక్కువ చేశారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మద్రాసురాష్ట్రంలో ప్రకాశం మంత్రివర్గంచే 1947లో ఈ చట్టం రద్దుచేయబడినది. కేంద్రప్రభుత్వం 1951లో రద్దుచేసింది. క్రిమినల్ట్రైబ్స్ చట్టం స్థానంలో హాబిట్యుయల్ అఫెండర్సు చట్టం వచ్చింది (Habitual offenders Act). ఇదియు ప్రస్తుత నాగరికతకు, పౌరహక్కులకు వ్యతిరేకంగానే ఉన్నది.

నేరస్వభావము ప్రతీకారచర్యలు తీసికొనటంవలన నశించేదికాదు. ఇది మానసిక ప్రవృత్తికి సంబంధించినది. కనుక మానవస్వభావంలో మార్పుతెచ్చే చికిత్స ఇందుకు అవసరం. ఇది క్రమంగా సాధించవలసియున్నది.

నేరప్రవృత్తి ఈ జాతులలో ప్రాచీనకాలంనుండి సాగుతున్న ఒక దుష్టాచారం. ఇది వారికి ఒక వృత్తియైనది. వంశపారంపర్యం వస్తున్నది. దీనిని తొలగించడం అత్యంత కష్టమైనపని. చంబల్ లోయలోగల ఈ జాతివారి కార్యకలాపాలు రాజస్థాన్, మధ్యప్రదేశ్ మరియు ఉత్తరప్రదేశ్కు విస్తరించియున్నవి. నేరపుస్వభావము సంచారప్రవృత్తిక్రింద మారినదా లేక సంచారస్వభావము నేరప్రవృత్తిక్రిందికి మార్చినదా చెప్పుట కష్టము.

నాగరికత పెరిగినకొలది వీరు దోపిడితనంలో క్రొత్తక్రొత్త ఆధునికపద్ధతులను అవలంభించ ప్రారంభించారు. ధనికులను, బాగా డబ్బు సంపాదిస్తున్న ఉద్యోగులను ఎత్తుకపోయి, పెద్దపెద్ద మొత్తాలను వారిదగ్గరనుండి తీసికొని వదిలిపెట్టడం జరుగుచున్నది. భారతదేశపు గొప్ప మానుషశాస్త్రవేత్తయగు డాక్టర్ డి. యన్. మజుందార్ వీరి జనసంఖ్య ఉత్తరప్రదేశ్ 1,400,000 వరకు ఉండవచ్చునని అంచనావేశారు. రాజస్థాన్లోగల కంజారులు, ఉత్తరప్రదేశ్లోగల డోములు, రాజపుత్రలో సాటియాలు ఉత్తరహిందూస్థానం మొత్తంలోగల బారియాలు చాల ప్రసిద్ధి చెందినవారు. ఆంధ్రప్రదేశ్లో కురవసులు సుప్రసిద్ధులే. దక్షిణభారతంలో బంజారీలు ఇందు ఘటికులే.

ఈ జాతులవారికి ప్రత్యేకమైన "పంచాయతీ" పద్ధతి అమలులోనున్నది. దీనినే 'క్రిమినల్ పంచాయతీ' అంటారు. ఈ పంచాయతీవారు దొంగతనంవలన

జైలుపడినవారికి, అవయవాలు పోగొట్టుకున్నవారికి నెలకు ఇంతని ఉపకారం వేతనం ఇస్తారు. గాంగ్‌సభ్యుడు చనిపోతే అతని మైనరు కుమారునకు నెలకు రు. 10 నుండి 15 రూపాయలవరకూ, తలపై బలమైనదెబ్బ తగిలితే రు. 200 వరకు ఒకసారి ఇస్తారు. చెవుతెగితే రు. 30/-లు, కన్నుపోతే రు. 60/-లు, కాలుపోతే రు.100/-నుండి రు.150 వరకు వ్రేలుపోతే రు. 5/-లు, ముక్కు పూర్తిగాపోతే రు. 50/-లు, శరీరంలో తెగిపోయిన అవయవపు ప్రాముఖ్యతను బట్టి రు. 250 నుండి రు. 500 వరకు సహాయం చేస్తారు. వీరు వారు నమ్మిన దేవతను పూజచేస్తారు.

వీరిని బాగుచేయుటకు భారతదేశమంతటా క్రిమినల్ సెటిల్‌మెంట్లను బ్రిటీష్‌ప్రభుత్వం ఏర్పాటుచేసి కొంతవరకు కృషిచేసింది. ఈ సెటిల్‌మెంట్లలో కొన్నిటిని మిషనరీల పరిపాలనకు అప్పచెప్పినవి. ఇట్టి సెటిల్‌మెంటులవలన నేమి, ప్రభుత్వం తీసికొనిన వీరి సంక్షేమ సౌకర్యాలవలననేమి వీరిలో పెద్ద మార్పు వచ్చినది. అక్కడా ఇక్కడా కొందరు ఇంకను ఈ వృత్తిలో ఉండినను ఆశ్చర్యపడివలసిన పనిలేదు.

## భిక్షుక సంచారజాతులు:-

వీరు ప్రపంచమంతటా ఉన్నారు. భిక్షుకవృత్తిచే జీవించువారందరు సంచార జాతులు కారు. సంచారజాతులందరు అడుక్కొనేవృత్తిగా కలవారు కారు. కడుబీదతనమే దీనికి ముఖ్యకారణము. భారతదేశంలో ఇది ప్రాచీనకాలంనుండి వస్తున్న ఒక ఆచారము. వీరికి సంగీతము ఒక ఉపకళ. చక్కగా పాటలుపాడి మెప్పించి అడుక్కొనే అలవాటున్నవారు ఆంధ్రప్రదేశ్‌లో చాలమందికి కలదు. దక్షిణభారతంలో రామస్వామి రంగస్వామి మతస్థులు ఊరూర తిరిగి భక్తికీర్తనలు పాడుతూ అడుక్కొనేవారు.

బీహార్, ఉత్తరప్రదేశ్‌లలో కార్వాలులు, బీహార్‌లో గుల్గులియాలు, సెంగివాలాలు, రాజస్థాన్‌లో ధియాలు, బెంగాల్‌లో జోగీలు, కాక్‌మారులు, ఒరిస్సాలో ముండుపట్టలు, కేలాలు, ఆంధ్రప్రదేశ్‌లో పాముల, దొమ్మర, దొంగల, మందుల, బుడబుక్కల, గిరికలలు, రాజమల్లులు, పెరికముగ్గుల, నక్కల,

మొండి లేక బండ, బాలసంతు, పెద్దింటిగొల్లలు, బైనోళ్ల, కాటిపాపలు, పూసల మున్నగువారెందరో కలరు.

ఈ భిక్షకవృత్తిచే జీవించువారిలో హిందువులు 85% మహమ్మదీయులు 5% సిక్కులలో 5% క్రిస్టియన్‌లో 5% కలరని అంచనా వేయబడినది. అంగవైకల్యం కలవారు కుష్టువ్యాధులుతో బాధపడువారు వీరిలో ఎక్కువగా కలరు.

భిక్షకవృత్తి నిషేధిస్తూ కొన్ని రాష్ట్రాలు చట్టాలు చేసినవి. కాని చట్టం వలననే ఈ ప్రవృత్తిని మార్చుట కష్టము. అంగవైకల్యాలకు, వ్యాధిగ్రస్తులగు వీరినిగురించి ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధతీసికొని, సంక్షేమపథకాలు గట్టిగా అమలు పరచవలసియున్నది. ఈ భిక్షకవృత్తి నేడు సంచారజాతులవరకే పరిమితం కాలేదు. అన్నిజాతులలోను వ్యాప్తిచెందియున్నది.

# 3. కొందరు సంచారజాతులు

## దొమ్మరులు:-

వీరిని మనం మన ప్రాంతంలో ఎప్పుడూ చూస్తూనే ఉన్నాము. వీరిని బిక్షుక సంచారజాతులక్రింద చేర్చవచ్చు. దొమ్మరులు 'ద్రిమ్మరులు' అను సంస్కృత పదంనుండి ఆవిర్భవించి యుండవచ్చునని కొందరి అభిప్రాయం. ద్రిమ్మరులు అనగా తిరుగుబోతువారని అర్థం.

దొమ్మరులు సాము, గరిడీచేసి ప్రేక్షకులను మెప్పించి వారిచ్చు డబ్బులు గాని, ధాన్యంగాని తీసికొని జీవించుచుందురు. వీరుచేయు సర్కస్‌ఫీట్లు చాల ఆశ్చర్యం కలిగిస్తుంది. స్త్రీలుకూడ ఈ సాములో పాల్గొనెదరు. నవీనంగా చేయ బడు సర్కస్‌లో కంటె వీరుచేయు కొన్నిసాములు మెచ్చుకోతగినవిగా ఉండును. వీరి స్త్రీలు సహజంగా అందంగా ఉంటారు. ఆరోగ్యంగా ఉంటారు. శరీర సౌష్ఠవం ఆకర్షవంతంగా ఉంటుంది. అందువలన వీరుచేయు సాముగరిడీ చాల మందిని ఆకర్షించగలదు.

దొమ్మరులు ఒరిస్సానుండి వచ్చినవారై ఉండునని భావింపబడుచున్నది. వారికొక ప్రత్యేక భాషకలదు, కాని అనేకభాషలు మాట్లాడగలరు. వీరు పందులను కూడ పెంచుదురు. గాడిదలపై సామానువేసికొని ఒకచోటనుండి మరియొక చోటికి తరలుచుందురు. పచ్చపొడవడం వీరందరికి తెలిసిన సాముదాయక విద్య.

వీరిపుడు అక్కడక్కడ స్థిరనివాస మేర్పరచుకొనినవారును కలరు. ఇట్టి వీరిసంఖ్య బహుతక్కువ. సాంఘిక వ్యవస్థలో వీరు దాదాపు హరిజనులస్థానం ఆక్రమించుకొనగలరు. అనేకరకాలగు కొయ్యలతో దువ్వెనలు చేసి అమ్ము కుంటారు.

వీరి వివాహవ్యవస్థ ఒక ప్రత్యేకమైనది. వివాహము కాకముందు స్త్రీలు వ్యభిచరించవచ్చు. గర్భవతి అయితే తన ప్రియుడిపేరు పెద్దలకు తెలియజేయవలసి

ఉంటుంది. కులసంఘం అతనిని ఆ అమ్మాయిని వివాహమాడవలసినదిగా బలవం తం చేస్తుంది. గర్భవతి అయిన యువతిని వివాహమాడుటేకాక, హెచ్చుమొత్తాన్ని అపరాధరూపంలో అతను చెల్లించవలసి ఉంటుంది. కన్యలను దేవాలయాలకు, ఇష్టదేవతలకు అంకితమిచ్చే ఆచారమొకటి వీరిలో కలదు. 'గుడ' 'మసియమ్మ' మున్నగు వారి దేవతల విగ్రహాలముందు కూర్చోబెట్టి ఆమె మెడలో తాళి కడతారు. అప్పుడు ఆమెను 'బసివి' లేక 'నాయకురాలు' అంటారు. ఆస్థితిలో ఆమె వ్యభిచార వృత్తిని స్వీకరించుటకు ఎట్టి అభ్యంతరం లేదు. ఇందు ఆమె స్వేచ్ఛగా వ్యవహ రించవచ్చు. 'బసివి' లేక 'నాయకురాలు'కు పుట్టిన ఆడ, మగ బిడ్డలు ఆస్తిని సమానంగా పంచుకుంటారు. ఆడపిల్లలుమాత్రం పుడితే వారు ఆస్తికి సర్వహక్కులు గలవారై ఉంటారు. 'బసివి' లేక 'నాయకురాలు' వేశ్యలవలె స్వేచ్ఛగా సంచ రించుదురు. అందుకనే 'చేసేది శివపూజలు, దూరేది దొమ్మరి గుడిసెలు' అనే సామెత మనలో ఉండనే ఉన్నది.

వీరి ఆహారపు అలవాట్లు సామాన్యమైనవే. వీరు పిల్లులను, చిట్టెలుకలను, పొలాలలో ఎలుకలను, పిచ్చుకలను కాల్చి తినెదరు. గొడ్డుమాంసం ముట్టరు. సహజంగా చచ్చిపోయిన జంతుమాంసం తినెదరు. వీరు అడుగుకొని జీవించుట కూడ మనం చూస్తున్నాము. ఏకులంవారి చేతిఅన్నం తినటానికైనా వీరికి అభ్యం తరంలేదు కాని రజకుల. హరిజనుల చేతి ఆహారం తినడానికి ఎందువలననో అంగీకరించరు ఇది యొక మూఢాచారం మాత్రమే.

దొమ్మరులలో మూడు తెగలవారున్నట్లు తెలుస్తున్నది. (1) ఆరెదొమ్మ రులు (2) గడదొమ్మరులు (4) రెడ్డిదొమ్మరులు. ఆరె, గడదొమ్మరులు సాము చేయుటలో అత్యంత నిపుణులు. రెడ్డిదొమ్మరులు సామాన్య సంసారజీవనము గడుపుటకు అలవాటుపడినవారు.

వీరు సంచారం చేస్తున్నప్పుడు ఇటీవల అనేక కష్టాలకు గురికావలసి వస్తున్నది. గ్రామాధికారుల, పోలీసులబెడద వీరికెక్కువ. కాని వ్యభిచారవృత్తి వీరిని చాల కష్టాలపాలుచేస్తున్నది. ఇటీవలకాలంలో వీరు వ్యభిచారవృత్తిని తగ్గించివేశారు. సంసారులవలె జీవించువారి సంఖ్యయే వీరిలో నానాటికి హెచ్చుగు తున్నది. వీరికి స్థిరనివాస మేర్పరచుటకు కొన్ని ప్రయత్నాలు జరుగుచున్నవి.

కాని అవి అంతగా ఫలించలేదు, వీరిలో ఇటీవల కొంతవరకు చదువుకొనినవారు నాయకత్వం వహించి, సంఘాలను ఏర్పాటుచేసి వీరిని సంస్కరించుటకు ప్రయత్నాలు చేయుచున్నారు. ప్రభుత్వంకంటె సంఘ సంస్కర్తలే వీరిని ఉద్ధరించుటకు ఎక్కువ అవకాశాలు కలవు. వ్యభిచారవృత్తి వీరిలో పూర్తిగా నిర్మూలించినచో, వీరు దేశానికి ఎంతో ఉపయోగపడగలరు.

సంచారజాతులలో ప్రత్యేక శ్రద్ధతీసికొని సంస్కరించవలసినవారు దొమ్మరులు, వీరిని పేర్కొని ఇంకొకరిని చెప్పవలసియున్నది. అందువలననే వీరిని గురించి ముందుగా వివరించడం జరిగినది. ప్రభుత్వం, సంఘసంస్కర్తలు వీరిని గురించి ఎంతగానో కృషిచేయవలసిఉన్నది.

## కాటిపాపలు:-

ఈ పేరులో 'కాడు' అనే పదం ఉన్నది. అంటే 'వల్లకాడు' అని అంటాము. దీనినే పారిభాషిక పదంలో 'స్మశానం' అనెదము. ఇందువలన వీరికి 'స్మశానం'తో సంబంధం ఉండేదని ఆ పేరువలన చెప్పకయే చెప్పుచున్నది. దీనినిబట్టి వీరు స్మశానవాటికలో పన్ను విధించి వసూలు చేసికొనేవారట. వీరు పురాణపురుషుడగు 'హరిశ్చంద్ర మహారాజు' సంతతియని చెప్పుకొనుటకద్దు. ఆ రాజు చివరకు 'కాటిపాపడు' దగ్గర కొలువున్నట్లు మనకు తెలియునుగదా: వాళ్ల ఇప్పటికి రాజులవలె బెండుతోను, మెరిసే అద్దాలతోను కిరీటాలను తలలపై ధరించి భిక్షాటన చేస్తుంటారు. వారి ఆధిక్యతకు చిహ్నంగా హరిజనులలో ఒక శాఖయగు మాదిగలనుండి ఇప్పటికి ఒకవిధమైన రుసుం వసూలుచేయుటకద్దు.

వీరికి 'సుదుకాడుసిద్ధులు' అని మరొక పేరుగలదు. సుదుకాడు అనగా వల్లకాడు లేక స్మశానం. పైనచెప్పినట్లు వీరొకప్పుడు స్మశానాలపై పెత్తనం చెలాయించేవారు. దహనసంస్కారం జరిగిన ప్రతిశవంపై ఉన్న గుడ్డను తీసికొని కొంత రుసుం వసూలుచేసేవారు. సుదుగాడుసిద్ధుడు వీరిపెద్ద. తొలుత వీరు 'గంగాధికార వక్కలిగ' కులమునకు చెందినవారనియు తరువాత 'కాటిపాపలు'గా ప్రత్యేకనామం పొందారని తెలుస్తున్నది. ఈ రెండు తెగలవారు ఒకరికులంవారిని మరొకరు వివాహం చేసికొనుటకద్దు. వీరిలో ఎవరికి కేటాయించిన ప్రాంతాలు

వారే చూచుకొనేవారు. స్మశానంలో రుసుం వసూలుచేసికోవడానికి వీరు తిరుగుతూ ఉంటారు. అప్పుడు వీరివద్ద ఉండే లోహపు లేక కొయ్యతో చేసిన గంటవలన వీరిని సులభంగా గుర్తింపవచ్చు. వీరికి స్థిరనివాసంలేదు. అడుక్కొంటూ సంచారం చేస్తారు. వీరు చాల వెనుకబడిన తెగకు చెందినవారు.

వీరి భిక్షాటన అనేకపద్ధతిలో జరుగుతుంది. ఒకగ్రామం చేరగానే కాటి పాపలు స్మశానంలో వారి జండాను ప్రతిష్ఠింపచేస్తారు. దీనికిముందు మాదిగలు వీరికి ఒక కోడిపెట్టను బహూకరిస్తారు. ఆ కోడిని బలియిచ్చి జెండాను ఆవిష్కరిస్తారు. హరిశ్చంద్రమహారాజు కథలోని 'వీరబాహుని' సంతతియని వీరు చెప్పుకుంటారు. అందువలన వీరబాహుని కులమగు మాదిగలనుండి బహుమతులు, విరాళాలు వసూలు చేసికొనేహక్కు తమకు కలదని ఘంటాపథంగా చెప్పెదరు. దీనినిబట్టి వీరు అస్పృశ్యుల తెగకు చెందినవారని స్పష్టమగుచున్నది. వీరిని షెడ్యూల్డుతెగలలో చేర్చుట న్యాయము. ప్రభుత్వం ఈ విషయం ఆలోచించెదరని విశ్వసింపవచ్చును.

## పాములు:-

పాములవారిని మనం చూస్తూనేఉన్నాము. వీరు ఆంధ్రప్రదేశమంతటా పాములను పట్టి ఆడిస్తూ, అడుక్కొంటు తిరుగుతూ ఉండడం మనకు తెలుసు. అయితే వీరిలో సంచారప్రవృత్తి క్రమంగా తగ్గుతున్నట్లు ఇటీవల గ్రహించగలుగుచున్నాము. పాములను ఆడించి అడుక్కోవటమే వీరి ప్రధానవృత్తి. ఎరుకలవారిలో కూడ కొందరు పాములను పట్టేవారున్నారు. కాని వారికి వీరికి పొత్తులేదు. పాములు లేకున్నను అడుగుకొని జీవించటమే వీరికి అలవాటు.

పాములను పట్టుకొనుట. ఆడించుట సాహసమైనవని. అనేక కళయని చెప్పినను చెప్పవచ్చును. త్రాచుపాములను పట్టుకొని మచ్చిక చేసికొనెదరు. పట్టుబడిన త్రాచుపాము రెండుసంవత్సరాలకంటె ఎక్కువకాలము జీవించదు. సర్పంయొక్క ఆయుఃప్రమాణం స్వేచ్ఛ లేకపోవడంవలన తగ్గిపోతుంది. స్వేచ్ఛగా సంచరించే త్రాచుపాము సహజసిద్ధంగా లభించే ఆహారంద్వారా కొన్ని



పాముల నాట్యము

సంవత్సరాలు జీవించగలరు. అదే పట్టుబడిన నాగుకు సరియైన ఆహారం సమకూర్చడం పాములవారికి దుర్లభం. పాములు అన్నం, పండ్లు దుంపలు తినవు. రెండు చిన్నకప్పలు, పొలంలో తిరిగే మూడు చిన్నఎలుకలు ఒక కోడెత్రాచుకు ఒకరోజు ఆహారం. అరణ్యాలలోను, పొలాల్లోను, గడ్డివాములలోను సంచరిస్తూ, సజీవంగాఉన్న ఎలుకనో, కప్పనో పట్టి తినగలవు. దాస్యం దాస్యమేకదా! పాము పాములవాని చేతిలో చిక్కుటతోనే సగం ప్రాణం పోతుంది. జీవచ్ఛవం లాగనే బ్రతుకుతుంది.

'పాము'లోని గరళం (విషం) తీసి వీరు అమ్ముతుంటారు. ఈ గరళానికి చాల గిరాకిఉన్నది. కొనఊపిరితో ఉన్నవానికి చివరచికిత్సగా గరళం పోస్తుంటారు. దానివలన ప్రాణంవచ్చి బ్రతుకుటకూడ కద్దు. కనీసం దీనివలన మరం తెలివివచ్చి అవసానకాలంలో ఆశ్రితులకు చెప్పవలసినదేమైన ఉన్న చెప్పుటకు అవకాశం కల్పిస్తుంది. రోగిప్రాణాలు కొంతసేపు నిలుపటానికి ఈ గరళం తోడ్పడుతుంది. ఆయుర్వేదవైద్యులు గరళాన్ని శక్తివంతమైన ఔషధంగా గుర్తించారు. పురాతనకాలంలో రోమ్ నగరంలో మనిషి ప్రాణాలను తీయడానికి ఈ గరళాన్ని ఇంజెక్షన్ ఇచ్చేవారట. ఈ అమానుషమైన పద్ధతి ఇప్పటికి అమలులోనున్నట్లు తెలియుచున్నది. అలోపతివైద్యులుకూడ ఈ ఉపయోగాన్ని ఇటీవల గుర్తించారు. పాములవాళ్లు పాముగరళం తీయడంలో బహునిపుణులు. పిండిన విషాన్ని నిల్వఉంచడానికి శాస్త్రీయపద్ధతులు వారికి తెలియవుగనుక అవసరమైనపుడే గరళం పిండి తీస్తారు. నిల్వవుంచిన విషం ఎండిపోయి, అందున్న శక్తి నశిస్తుంది. ఎక్కువ పనిచేయదు.

పాములను పట్టి ఉంచే బుట్టలను మనం చూస్తూనే ఉన్నాము. ఆ బుట్టల చుట్టూచేరి వారిపిల్లలు ఆడుకొంటూ ఉంటారు. వాళ్లకు పాములంటే భయం ఉన్నట్లులేదు. అది వారికొక అలవాటై పోయినది. ఏమైనా వీరిది పాములతో చెలగాటం. ఇది చాల ప్రమాదభరితమైనది. ఈ వృత్తినుండి వీరిని తప్పించవలసిన బాధ్యత ప్రభుత్వంపై ఉన్నది. ఇంకొక ప్రత్యామ్నాయ వృత్తి చూపెట్టినగాని ఇది వీరు మానరు. వీరు కాకులను, పిల్లులను, ఎలుకలను, బల్లులను సయితం తినుటకు వెనుకాడరు. వీరిది చాల తెలివైనజాతి. వీరికి ప్రత్యామ్నాయ వృత్తులలో శిక్షణయిచ్చిన అభివృద్ధిలోనికి రాగలరు.

## డొక్కలు:-

డొక్కలవారు కొద్దిగా విద్య నేర్చినవారే. వారి చంకన ఎప్పుడూ తాళపత్రగ్రంథాలుండును. వాటిలోని శ్లోకాలు చదివి అర్థం చెప్పగలరు. హరిజనులలో ఒక తెగయగు మాదిగవారి వంశావళిగురించిన వివరాలు అందుండును. వంశవృక్ష సంబంధమైన పరిజ్ఞానం వీరికి కొంతవరకు కలదని దీనివలన బోధపడుచున్నది. ఇందలి శ్లోకాలు చదివి వారికి చెపుతూ ఉంటారు. అందుకుగాను మాదిగవారు వీరికి విధిగా కొంతసుంకం ముట్టచెప్పడం జరుగుతున్నది. ఈ వసూళ్లకై వీరు గ్రామాలను పంచుకొంటారు. ఒక్కొక్కరి అధీనంలో 150 గ్రామాలవరకు ఉండును.

వీరు క్షురకర్మ చేయించుకోరు. గడ్డం వగైరా పెంచుకొంటారు. ఒకరి గ్రామాలకు ఇంకొకరు పోరు. సంవత్సరంలో ఎక్కువకాలం తిరుగుతునే ఉంటారు. వసూలుచేసినది వారి భుక్తికి ఉపయోగిస్తారు. వీరు చాపలు అల్లి అమ్ముతుంటారు కూడా.

వీరి ఇండ్ల పేర్లలో 'బాణాల' 'కర్ణి' 'పోశెట్టి' 'జడ' 'గౌరవరం' 'డాకుర్' 'అల్లం' మున్నగునవి కలవు. శివకంచిలో వెంచేసియున్న 'జాంబవానుని' సంతతి యని వీరు చెప్పుకుంటారు. కులపెద్దలమాట వీరు జవదాటరు. తగాదావచ్చినపుడు కులపెద్ద చెప్పినది శిరసావహిస్తారు.

వీరికి కొన్ని మూఢవిశ్వాసాలున్నవి. గోడలతో నిర్మించిన ఇండ్లలో నివసించుట శుభప్రదంకాదని వీరి భావన. అందువలన నిండాఆకులతో నిర్మించిన ఇండ్లలోనే నివసించెదరు. వరుసగా ఏడెనిమిదినెలలు సంచారంచేసి నియమిత ప్రాంతాలకు తిరిగివచ్చి విశ్రాంతి తీసికొంటారు. అట్టి వారి విశ్రాంతి ప్రదేశాలలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన నల్గొండజిల్లాలోని 'కలవకుంట' గ్రామం ఒకటి.

భగవంతుని డొక్కలోగల ప్రేవులనుండి జన్మించిన కారణంగా వారికి 'డొక్కల' అని పేరువచ్చిందని వీరినమ్మకం. హరిజనులలో ఒక తెగయగు

మున్నగువాటినికూడ అమ్ముతారు. సాధారణంగా ప్రతి సంచారజా
చాపల్లి అమ్మట వీరు చేయరు. అడపాతడపా మేకలను పెంచి ఓ

గుండా బుచ్చిగాడు అవి పిలువబడే వీరి మతిపెద్ద పెట్టుబాధ
సందున వీరు క్రైస్తవమతం పుచ్చుకున్నట్లు తెలియుచున్నది. వీరు
కొనినను హిందూసాంప్రదాయాలగు కుంకుమ ధరించడం మున్నగు
లేదు. తిరుపతి తరచువెళ్లి వెంకటేశ్వరస్వామిని దర్శనంచేసికొ
అవదలు వచ్చినపుడు మొక్కుబడులు వీరు తీరుస్తుంటారు.

మందులవారు శ్రేష్ఠమైన కస్తూరిని సేకరించి అమ్ముతుంటారు.
వైద్యంలో కస్తూరి ఉపయోగం అందరికి తెలిసినదే. ఆవు శరీరం
'గోరోజన'మునుకూడ వీరు అమ్ముతారు. గోరోజనంకూడ వైద్య ప్ర
గల ఔషధమే. వీరు మాదిగలనుండి దీనిని సంపాదించెదరు.

వీరు ప్రజలకు ఏదోవిధంగా తోడ్పడుతునే ఉన్నారు. కాని ప్రజ
భూతి, సహకారం వీరికి లభించడం లేదు. ప్రభుత్వ సహకారము అ
లేదు. వీరి పిల్లలను వీరినుండి వేరుచేసి భోజన వసతి ఉచిత సౌకర్య
పాఠశాలలో చేర్చవలెను. వీరిని గురించి ప్రత్యేక శ్రద్ధ తీసికొనవలసి

## బుడబుక్కలు:-

ఆంధ్రప్రదేశ్ అంతటా తిరుగుతూ మనకు కనబడే సంచార జా
వీరు పూర్తిగా సంచారజాతివారు కాదు. అక్కడక్కడా స్థిర నివాస
కొనినవారుకూడ వీరిలో కలరు. ఐనా, వీరు సంవత్సరంలో కొన్ని
ముఖ్యంగా సంక్రాంతి పండుగకాలంలో సంచారం చేస్తారు. తెల్లవారు
గ్రామాలలో తిరుగుతూ ప్రతి ఇంటివద్దకు వచ్చి ఆశీస్సులు పల
జ్యోతిషం లాంటిది చెప్పుచుంటారు. వీళ్ళ వేషమే ఒక ప్రత్యేక
తిలో ఉంటుంది. పాతగుడ్డలను అడుక్కొని వాటితో వేషం ధరిస్తారు.
వ్రేళ్ళతో పట్టుకొనే చిన్న ఢమరకం లాంటిది లయబద్ధంగా మోగిస్తు

తలమీద పింఛమైన పాగాపెట్టుకొని, వివిధరంగులతోకూడి నేలకంటా వ్రేలాడే రంగు రంగుల గుడ్డలు ధరిస్తారు. వీరి వేషం చాల ఆకర్షవంతంగా ఉంటుంది. పిల్లలకు భయం కలిగిస్తుందికూడా. ఒక నల్లటి గొంగుగు వేసికొని, నొసట పెద్ద కుంకుమ బొట్టు దిద్ది, కనురెప్పలమధ్య నల్లటిమసిరంగు పూసికొని ఉంటారు. ఏమైనా ఇచ్చేవరకు ఇంటి ముందు ఉంకి అడుస్తుంటారు. ఏమి ఇవ్వకపోతే శపించినట్లు గందరగోళం చేస్తారు. అందువలన స్త్రీలకు వీళ్ళనుచూస్తే భయం. డబ్బో, గింజలో, పాతగుడ్డలో ఇచ్చి వీళ్ళను సాగనంపుతారు.

వీరుకూడ చాల వెనుకబడిన జాతి. వీరిలో బహుకొద్దిమంది చదువుకొని ఇప్పుడు ఉద్యోగాలు చేస్తున్నారు. వీరిని బాగుచేయడానికి ప్రభుత్వం కృషిచేస్తూనే ఉన్నది.

వీరు ఎక్కువగా రోడ్లప్రక్క చిన్న చిన్న గుడిసెలు వేసికొని నివసిస్తుం టారు. వీరికి అడుక్కొనే వృత్తే ప్రధానంగా కనబడుతున్నది. వీరికి ఇతర వృత్తులు నేర్పితే, దీనిని వీరు మానడం పెద్ద కష్టమేమీ కాదు.

## పరికముగ్గులు:-

వీరిని 'పలుకుముగ్గుల' వారని పిలవడం కద్దు. పరికముగ్గుల స్త్రీలకు పచ్చబొట్లు పొడవడం ప్రధాన వృత్తి. వీరు తెలుగుప్రాంతంలో తిరుగుతూ ఉంటారు. పరిక (శేక ముగ్గు) పదంవలన వీరికి ఈపేరు వచ్చిఉంటుంది. పచ్చ బొట్టు పొడుచుటకు నమూనాలు వెంట తీసికొని వెళ్లి చూపించి ఎవరికి ఇష్టమైన నమూనాప్రకారం పచ్చబొట్టు పొడుస్తారు. భిక్షాటన, సోది చెప్పడం పచ్చబొట్టు పొడవడంవలన వీరు జీవనం చేస్తారు.

వీరిలో కొందరు జబ్బులు నయం చేస్తామని తిరుగుతుంటారు. జబ్బు నయం చేయడానికి వీరు పెద్ద తంతుచేస్తారు. మంత్రాలు చదువుచున్నట్లు నటి స్తారు. ఆంజనేయస్వామి, భేతాళ, నృసింహస్వామి రూపాలను నేలపై గీసి దానిపై వ్యాధిగ్రస్తుని కూర్చోపెడతారు. మతి స్థిమితంలేని రోగి ఇదంతాచూచి

ఏమేమో పలుకుతాడు. తన జబ్బునుగురించిన చాల విషయాలు వెల్లడిస్తాడట. రోగి శరీరంలోని దుష్టశక్తిని పట్టుకొని ఒక సీసాలోనికి ప్రవేశపెట్టి బంధించినట్లు తంతుచేస్తారు. ఆ సీసాను స్మశానంలో పాతిపెడతారు. ఈ చికిత్సకు కొంత ద్రవ్యం పది, పదిహేను రూపాయలవరకు పరికముగ్గులవానికి సమర్పించవలసి ఉంటుంది.

పచ్చబొట్టు పొడవడం ఒక ప్రత్యేక కళ అనే చెప్పాలి. అవిశఆకు, మందపసుపు, నల్లటి ఒక పదార్థంతో మిశితంచేసి లేహ్యంలాంటిది తయారుచేస్తారు. ఈ లేహ్యములో కొంత నీరుకలిపి అందు మూడుసూదులు ముంచి చర్మంపై పొడుస్తారు. ఇంటి నమూనా, రాములవారి ఉయ్యాలతొట్టె, తేలు మున్నగు రూపాలలో పచ్చబొట్టుతో శరీరంపై చిత్రిస్తారు. వీరిందు కనబరచు చిత్రకళ మెచ్చుకోతగినది. పేర్లుకూడ చిత్రిస్తారు.

ఇదియొక పురాతనతెగ. వీరికి కులపంచాయతీ ఉన్నది. పంచాయతీ జరిమానాలను విధిస్తారు. చెల్లించనిచో కులంనుండి వెలివేస్తారు. బలిజలు, శెట్టిలు వీరికి అధిపతులుగా ఉంటారు. పంచాయతీ పరిష్కారంలో వీరి సలహాలు తరచు తీసికొంటారు.

వీరిలో వివాహాలు జరగడం, విడాకులివ్వడం కూడ సులభంగా జరుగుచుండును. కట్నం నలబై రూపాయలనుండి వెయ్యిరూపాయలవరకు ఉంటుంది. వీరిలో వివాహాలు, శ్రాద్ధకర్మలు వారికి తోచినవిధంగా శాస్త్రయుక్తంగానే జరుపుకుంటారు. ఇతర పురోహితుల ప్రమేయం ఉండదు. కట్నంచెల్లించి, విందుచేస్తారు. విందు అనంతరం తలంబ్రాలు, తాళికట్టడం జరుగుతుంది.

వీరికి ప్రత్యేకంగా ఒక భాషఅంటూ లేదు. సత్పది, మన్నది, కావడి, మేండ్రకుర్తి మున్నగునవి వారి గోత్రాలలో కొన్ని.

రెండుతరాలక్రింద ఈ జాతిలేదని కొందరి వాదన. ఎరుకలవారిలో ఇదియొక ఉపతెగ అని కొందరి అభిప్రాయం.

## పెద్దింటి గొల్లలు:-

ఈ జాతివారు రాయలసీమ ప్రాంతంలో ఎక్కువగా కనపడెదరు. స్త్రీలు పచ్చపొడిచి జీవిస్తారు. పురుషులు తాంత్రికవిద్యను ప్రదర్శించెదరు. దీనినే 'మోడి' విద్య అందురు. ఈ విద్యాప్రభావంతో ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేయగలరు. ఆశ్చర్యచకితులను చేయగలరు. ఇందుమూలంగా వారి ప్రశంసలను చూరగొని వారిచ్చినది సంతోషంతో స్వీకరిస్తారు. ఇదే వారి ప్రధానవృత్తి. దీనికి తోడు మందులను అమ్మి కొద్దిగా సంపాదిస్తారు.

వీరు చిన్నచిన్న గుడిసెలలో నివసిస్తారు. వారికి ఆస్తిపాస్తులేమి ఉండవు. గింజలు నిల్వ ఉంచుకోరు. ఎక్కడికక్కడే అడుక్కొనడమో కొనుక్కొనడమో జరుగుతుంది. కొద్దిపాటి పాత్ర సామాగ్రి వారివెంట ఉంచుకొంటారు. సామాను మోసికొని రావడానికి వీరివెంట ఒకటి రెండు గాడిదలు ఎప్పుడూ ఉండును. వేసవిలో సంచారంచేసి వర్షాకాలంలో వారి స్వస్థలాలకు తిరిగివస్తారు.

వీరి జనసంఖ్య చాల తక్కువ, అల్పసంఖ్యాక వర్గానికి చెందినవారు. ఒక్కొక్క గ్రామంలో ఒకటరెండు కుటుంబాల కంటె ఎక్కువ ఉండరు. ఆచార వ్యవహారాలలో, అలవాట్లలో, గోత్రాలు, ఇంటిపేర్లతో సహితం ఎరుకలవారికి దగ్గరగా ఉంటారని చెప్పెదరు. ఎరుకలవారి గోత్రాలగు సాత్పాడి, కానాడి. మెండగుర్తి, మన్పాడి మున్నగునవి వీరికి కలవు. వీరి పూర్వీకులు ఎరుకల భాష మాట్లాడేవారట. ఇప్పటి సంతతివారికది తెలిసినట్లు లేదు. వీరిని ఎరుకల వారితో సమానంగా ఎంచవచ్చును. ఎరుకలవారివలె వీరిని షెడ్యూలు జాతులలో చేర్చుట ఎంతేని అవసరం.

## నక్కలు:-

నక్కలవాళ్లు నక్కలపేరుతో వ్యవహరింపబడుతున్నారు. బోతు, గూడల, గొల్ల, ముతరాచు మున్నగువారు కొలిచే 'అంకమ్మదేవతకు' వాహనం నక్క అని చెప్పెదరు. అందువలన నక్కలవారు పైతెగలకు చెందినవారని బోధపడు

తున్నది. వారి దేవత వాహనముపేరనే వీరు చెలామణిఅవుతున్నారని ఊహించ వలసియున్నది. కురునికర్ణులకు కూడ ఈ పేరుకూడ కలదు. వీరు నక్క కొమ్ములను తయారుచేసి ప్రదర్శించెదరు.

వీరు ప్రధానంగా కోస్తాజిల్లాలలో కనపడెదరు. వీరి అలవాట్లు అతి ప్రాచీన మైనవి. వీరు పక్షులను పట్టుకొని వాటిని గ్రామాలలో అమ్మి జీవిస్తారు. వీరు చాల వెనుకబాడిన జాతివారు.

## మొండి బండ :-

ఇదొకవిధమైన ప్రత్యేకజాతి. తమిళనాడులో ఈ జాతిని మొండివాళ్లని అనెదరు. వీరి పేరుకు తగినట్లు వాస్తవంలో వీరి స్వభావం పూర్తిగా మొండిదే. సాహసమెక్కువ. మొండిగా వ్యవహరిస్తారు, బండతనమెక్కువ, అడుక్కొని జీవించడమే వీరి ప్రధానవృత్తి. కాని వీరు అడుక్కొనడం నమ్రతగా జరుగదు. దాదాపు భయపెట్టినంతపని చేస్తారు. కొన్నిచోట్ల వీరు పెద్ద బండతీసికొని అడుక్కోటానికి బయలుదేరెదరు. ఇంటిముందు తిష్టవేసికొని కూర్చొని ఉంటారు. ఏమీ ఇవ్వకపోతే అ బండతో తలకాయను బాదుకొనెదరు. ఇది చూచియైనను ఎక్కడ చనిపోతాడోనని భయపడి ఏదో ఒకటి ఇచ్చి పంపెదరు. కొందరు చాకుతో తొడలపై రక్తంవచ్చేటట్లు కోసుకొంటారు. తల విరబోసికొని భయంకరాకారంగా తయారవుతారు. పైనచెప్పినట్లు బండరాయితో బాదుకొంటారు. ఐచ్ఛికంగా వాంతిచేస్తారు. మట్టిలో పొర్లాడుతారు. కోపంవస్తే ఇండ్లపైన మట్టిని మలాన్ని విసరటానికి వెనుదీయరు. వీరి పద్ధతే భయంకరమైనది. అమానుషమైనది. ఇటీవల ఇది వీరిలో అంతగా కానరాదు. బహుశా పెరుగుతున్న నాగరికతా ప్రభావం వీరిపై పడిఉండవచ్చును.

చిన్నప్పటినుండి వారి సంతానానికి వారు కావాలనుకోగానే వాంతి చేసికొనే విద్యనునేర్పుతారు. త్రాగగలిగినంతవరకు వేడినీటినో, గంజినో త్రాగించి కావలసినంతవరకు వాంతిచేసికొనేటట్లు అలవాటుచేస్తారు. అడుక్కోవటానికివెళ్తూ ఒకవిధమైన ద్రవాన్ని త్రాగుతారు. అడుక్కొంటూ ఈ ద్రవాన్ని నోటిలోనికి తెప్పించి ప్రదర్శిస్తారు. కూటికొరకు కోటివిద్యలు కదా ?

ఈ జాతి వేరు వేరు జట్లుగా విడిపోయి యాచనకు బయలుదేరుతారు, వారు వెళ్లే ప్రదేశాలను విభజించుకుంటారు. ఒకరి ప్రదేశంలోకి ఇంకొకరు ప్రవేశించి అడుక్కోరు. రైతులనుండి, వ్యాపారస్థులనుండి వారికి వార్షికము లుండును. ఈ జాతిలో పంచాయతీపద్ధతి యున్నది. కులపెద్ద చెప్పినట్లు నడచుకొంటారు. వీరు కోస్తాజిల్లాలలోను, రాయలసీమలోను ఎక్కువగా తిరుగుతారు.

వారు స్వంతస్థలాలలో పూరిగుడిసెలలో నివసిస్తుంటారు. అమమాసాలు ఆ గుడిసెలలో కాపురం చేస్తారు. వీరికి కాకులను తినే అలవాటున్నది. మాంసాహారులైన ఇతర కులాలవారు ఇందుకే కాబోలు వీరిని హీనంగా చూస్తారు. వీరిలో వ్యభిచారం పెద్ద దోషంగా పరిగణిస్తారు. సంఘ బహిష్కారంవరకు వస్తుంది.

వీరు యాచించటం ఒక హక్కుగా పరిగణిస్తారు. అధికారయుతంగా అడుగుతారు. ఇది వారికి అనువంశికమని వారి భావన. ప్రతి రైతూ దుక్కికి శేరుగింజలు చొప్పున వీరికివ్వవలసినదే. దుక్కి అంటే ఆరోజులలో 18 ఎకరాలు.

వీరొకప్పుడు పశువులను పెంచేవారని తెలుస్తున్నది. పూర్వంలో వీరివద్ద చాల ఆవులుండేవట. రైతులు తమ ఆవులు తప్పిపోతే వీరిని శిక్షించేవారట. వారికి ఆవులు కావలసినప్పుడుకూడ వారిని శిక్షకు గురిచేసేవారట. వీరిని గురించి ఒక కథ వాడుకలో ఉన్నది. రైతులు వీరిని ఒక పర్యాయము విందుకు ఆహ్వానించి అందరిని శిరచ్ఛేదనచేసి వాళ్ల పశువులను స్వాధీనం చేసికొన్నారట ఇంటి వద్ద మిగిలిన ఒక బాలుడు, ఒక బాలిక రైతులదగ్గరకు వచ్చి మొరపెట్టుకొన్నారట. రైతులు నిర్దాక్షిణ్యంగా వారి ముంజేతులు నరికి వారికొక పాత్ర, కర్ర, కడెం ఇచ్చి అడుక్కొని బ్రతుకమని పంపారట. అందువలన వీరికి మొండివాళ్లని పేరు వచ్చిందని చెప్పెదరు. ముంజేతులు నరికిన రెడ్డికి మొండిచేతులుగల బిడ్డలు పుట్టెదరని భగవంతుడు శాపం పెట్టాడట. ఈ శాపంనుండి విముక్తి అగుటకు రెడ్లు 'మొండిశిఖ నాయక' అనే దేవతను ఆరెడ్లు ఈనాటికి కొలుస్తూ ఉంటారట. మొండివాళ్లనుచూచి భయపడి వాళ్లకు ఏవో బహుమతులివ్వడం రైతులకు అలవాటయినది. మొండివాళ్లు రైతులను చూచి వారిని సంతోషపెట్టుటకు వారిని పొగడుతూ పాటలు పాడుతారు. ఇది అనుశ్రుతంగా మొండివాళ్లను గురించి చెప్పుకుంటున్న కథ. వీరినిగురించి ఇంకొక కథకూడ చెప్తుతుంటారు. రెడ్డికులానికి

చెందిన ఇద్దరు స్త్రీలను అప్పుడు పరిపాలించు ముస్లిములు ఎత్తుకొనిపోగా వీరు ముస్లిముల బారినుండి వారిని రక్షించారట. అందుకొరకు రెడ్లు వీరికి వార్షికంగా ధాన్యం, ధనం, పారితోషికాలు ఇవ్వడానికి ఒప్పుకున్నారు. వీటిని ఇచ్చేదాకా పట్టు వదలిపెట్టరు గనుక వీరిని మొండివారని పిలవడం జరుగుతున్నదట. పట్టు వదంక హఠంచేస్తారు గనుక వీరికి మొండి పేరు సార్థకమైనది.

ఇది పరమ మొండిస్వభావంకల ఒక జాతి. వీరిని మార్చడం కష్టసాధ్యమైనపని. ఇందుకు ప్రభుత్వం ప్రత్యేకపద్ధతులు అవలంభించవలసియున్నది.

## బాలసంతు (బాలసంతోష) :-

పాటలను పాడి పిల్లలను, సంతోషపెట్టే ఒక జాతి యిది. చక్కగా పాటలుపాడే ఇది ఒక జాతియని 'కర్నూల్ మాన్యుయల్'లో వ్రాయబడియున్నది. వీరు శ్రావ్యంగా పాటలు పాడుతూ బొబ్బిలి కథ, కర్నూల్ నవాబు కథ, గంగా పార్వతి వివాదకథ మున్నగు కథలను బహు రమ్యంగా చెప్పుచుంటారు. ప్రజలు, ముఖ్యంగా పిల్లలు ఈ కథలను ఎంతో ఆసక్తితో వింటారు.

ఈ జాతివారు తెలంగాణా ప్రాంతంలో ఎక్కువ కనపడెదరు. యాచన వృత్తివలన జీవించే జోగులు, సన్యాసుల అలవాట్లు వీరికి ఎక్కువ కలవు. వీరు మరీ దీనులు కారు గాని వీరు వృత్తిరీత్యా భిక్షకుల జాతికి చెందినవారే. స్త్రీలు చాపలు అల్లి అమ్మెదరు. పురుషులు యాచనకు బయలుదేరెదరు. వీరు రామాయణం, మహాభారత గాథలను గానం చేస్తూ అడుక్కొంటారు. వీరి గానం విని ప్రజలు ఆనందిస్తారు.

వీరికి తెలుగుతప్ప ఇంకొక భాష తెలియదు. సినిమాలు వచ్చిన తరువాత వీరి వృత్తి పడిపోయినదని బహురూపధారులగు వీరిలో కొందరు విచారం వ్యక్తం చేశారు. ఆరునెలలు స్వగ్రామంలోనే ఉంటారు, మిగతా ఆరునెలలు పాడుకొంటూ అడుక్కొంటూ సంపాదించుకొంటారు.

వీరు నక్కలను, ఎలుకలను, ఉడుములను పట్టి తింటారు. వీరు పాడుతూ సంతోషంగా ఉంటారు గనుక 'సరదావాండ్లు' అను మారుపేరుకూడ వీరికున్నది.

వీరు పలురకాలైన వేషాలువేసి ప్రజలను సంతోషపరుస్తారు. అందుకే వీరిని బహురూపధారులని అంటారు. మారువేషాలు వేసికొని బాలనాగమ్మ, బొబ్బిలి, కామగంటికథలు చెప్పి ప్రజలను మెప్పించి వారివలన పారితోషికం పొందుతారు.

వీరికి తగు ప్రోత్సాహం ఇస్తే, వీరికి సహజంగా కల గానకళను అభివృద్ధి చేసికొని, నవీన పద్ధతులతో బహురమ్యంగా కథలు చెప్పి అభివృద్ధిలోనికి రాగలరు. ప్రభుత్వం వీరికి ఇందుకు తగు వసతులు కలుగజేయవలసియున్నది.

## పిచ్చిగుంట్లు–

పిచ్చిగుంట్లవారు యాచనవల్లనేగాక, శ్రావ్యంగా కథలుకూడ చెప్పి జీవించు తెగకు చెందినవారు. ఈ జాతివారికి మూలికావైద్యం కొంతవరకు తెలియును. ఓషధులు ఉపయోగించి జ్వరం, కడుపునొప్పి మున్నగు వ్యాధులు నయంచేస్తారు. వీరు తెనుగుదేశంలో సంచారం చేస్తారు. పందులనుకూడ పెంచే అలవాటున్నది.

ఒక గ్రామంనుండి ఇంకొక గ్రామానికి తరలిపెత్తుంటారు. డోలు లాంటిది వాయిస్తుంటారు. ఇతిహాసకథలు చెప్పెదరు. చక్కగా పాడగలరు. బోధకుని వలె వ్యవహరించి గ్రామస్తులకు అనేక మంచిసంగతులు బోధిస్తారు.

గ్రామాలలో నివసించే కమ్మవారి, కాపులయొక్క తదితర కులములవారి ఇంటిపేర్లు, గోత్ర సూత్రములు, వంశావళి వీరికి బాగా తెలియును. వీరికి ఈవిషయంలో మంచి పరిజ్ఞానం కలదు.

రెడ్లు, కమ్మవారి ఇండ్లకువెళ్ళి వారి కుల గోత్రాలను వల్లిస్తూ ప్రస్తుతిస్తూ పాటలు పాడెదరు. ఇందుకు వారు సంతోషించి ప్రతిఫలంగా మేకలను, తదితర వస్తువులను బహుమతులుగా ఇస్తారు. మూడేండ్లకొకసారి పాకనాటి

రెళ్లను సందర్శించి బహుమతులను స్వీకరిస్తారు. ఆశీస్సులతోను, పొగడ్తల తోను వారిని ముంచెత్తివేస్తారు. వారి ప్రశంసలకు ఉక్కిరి బిక్కిరై పుష్కలంగా బహుమతులను ఇచ్చి పంపెదరు.

వారు తెలుగుమాత్రమే మాట్లాడుతారు. పిచ్చిగుంట్లవారు ఒక విధమైన వాయిద్యంతో, ఆహ్లాదమైన శ్రుతితో, గానంచేస్తూ కథలు చెప్తుంటారు. ఈకథలను తెల్లవార్లు చెప్పినా జనం వింటూనే ఉంటారు. కథ చెప్పేటప్పుడు ఒకరు బూర ఊదుతూ ఉంటారు. ఇంకొకరు కథ చెప్తారు. గొఱ్ఱెచర్మంతో చేసిన గుమ్మడి కాయ ఆకారంలో ఆ బూర ఉంటుంది. బూరకు కొమ్మువంటి పిల్లనగ్రోవుల జంట (గొట్టములు) అమరుస్తారు. అందుండి వచ్చేధ్వని స్వరయుక్తంగా శ్రావ్య మైనదిగా ఉంటుంది. కాటంరాజు కథలు, కాలకోడి కథ, పాపనూకమ్మ కథ, పెద్దిరాజు, సిద్ధిరాజు, ముద్దిరాజు కథలు చెప్పగలరు.

వీరు కథలు చెప్పడమేగాక. మూలికా వైద్యం చేయగలరు. వీటివలన ప్రజలను మెప్పించి యాచించేవృత్తి వీరిది. కేవలం యాచనచేయడమే వీరి వృత్తి కాదు. అందువలన ప్రజలు వీరినిచూచి ఆదరిస్తారు. అసహ్యించుకోరు. సంతో షంతోనే పారితోషికాలు ఇస్తారు.

వీరు హిందూదేవతలను ఆరాధిస్తారు. హిందూపండుగలను చేసికొంటారు. ఒక ఇంటిపేరుగలవారు వియ్యమందరు. వీరిలో పంచాయతీపద్ధతి ఉన్నది. నేర స్థులకు వారే శిక్షలు విధిస్తారు.

గారడీ:-

ఇదియు ఒక భిక్షుకజాతి. పాములను మచ్చికచేసికొని పట్టుకొనగలరు. మూలికావైద్యం తెలుసు. హస్తలాఘవం ఉన్నది. మాయలు, అద్భుతాలు చేస్తారు. తెలుగుప్రాంతంలో ఉండేజాతి ఇది.

సాహసోపేతమైన గారడీలు, ఆశ్చర్యకరమైన బుడిడీలు చేసి ప్రజలను సంతోష సంభ్రమాలకు గురిచేసి మెప్పించి పారితోషికరూపాన సంపాదిస్తారు.

ప్రాంతం ప్రాంతం తిరుగుతూ ఉంటారు. వీరి ప్రధానవృత్తి తమాషాలు, గారడీలు చేయడమే. వీరు చాల వెనుకబడినజాతి.

## బైనోళ్ళు:-

వీరు శ్రావ్యంగా పాటలు పాడగలరు. దేవుని, దేవతలను ప్రస్తుతిస్తూ కీర్తనలు పాడెదరు. గ్రామాలలో జాతర్లు, ఉత్సవాలు జరుగుతున్నపుడు, గ్రామస్తులు వీళ్ళను పిలిపించి పాల్గొనేటట్లుచేస్తారు.

ఆంధ్రప్రదేశ్‌లో కర్నూల్, అనంతపూర్ జిల్లాలలో ఎక్కువగా ఉన్నారు. గ్రామ జాతర్లలో, గ్రామోత్సవాలలో వీరు ఎల్లెడలా కనపడుతుంటారు. వీరు చెప్పు ఎల్లమ్మకథలు గ్రామస్తులు ఎంతో ఆసక్తితో వింటారు. మాదిగవారికి పురోహితులుగా పరిగణింపబడతారు.

వీరు చెప్పేకథలు బుర్రకథలను బోలి ఉండును. వీరు ఉపయోగించే డోలు లాంటిది వర్తుల స్తంభాకారంలో ఉంటుంది. ఒకవైపు పలుచని చర్మము లోపలిభాగంలో గజ్జెలు అమర్చబడియుండును. వీటిని వాయించి వంతపాడుతుండగా, ఒకరు తాంబూరతీగెను మీటి కథాగానం చేస్తారు.

## పూసలు:-

వీరు పూసలు అమ్ముతారు. బస్తీలలో రోడ్లప్రక్కన స్త్రీలు కూర్చొని అమ్ముకుంటూ ఉంటారు. వారూ పూసలనే ధరిస్తారు. ఆంధ్రప్రాంతంలో వీరు తిరుగుతుంటారు. వీరి జనసంఖ్య చాల తక్కువ.

వీరు కథలూ, గాథలూ శ్రావ్యంగా చెప్పగలరు. "చిన్నలక్షమ్మ" "దేశమ్మరాజు" "బొబ్బిలి" "కాంభోజరాజు" కథలు చెప్పి గ్రామస్తులను మెప్పించగలరు.

వీరూ చాల వెనుకబడినజాతి. నాగరికత చాల తక్కువ. దేశాటన వీరికి చాల ఇష్టం. కేవలం ఆడుక్కొనేజాతి కాదిది. కథలు చెప్పి, పూసలను అమ్మి జీవిస్తుంటారు.

## దాసరి:-

వీరిని కొందరు దొంగదాసరులని పిలవడం కద్దు. కాని ఇది మర్యాదపదం కాదు, అమానుషం కూడ. దాసరులనే వీరు ప్రసిద్ధికెక్కియున్నారు. ఇదియొక నేరపుజాతి.

నేరముచేయు ఇతర హీనపు జాతులవారి నెవరినైనను వీరు తమలో చేర్చికొనెదరు. మొదటగా ఇతరులను తమలో చేర్చుకొనేముందు, తమ కార్యకలాపాలు రహస్యంగా ఉంచగలమని ప్రమాణస్వీకారం చేయిస్తారు, ఇందుకు గుర్తుగా నాలికమీద వేపపుల్ల కాల్చి చురక వేస్తారు. నేరాలు చేయడంలో శిక్షణ ఇస్తారు.

దొంగతనానికి వెళ్లేముందు దగ్గరగల అడవిలోనికి రాత్రిళ్లు వెళ్లి తమ అధిష్టానదేవతయగు ఎల్లమ్మను పూజించి కోడినో, గొర్రెనో బలియిస్తారు. తాము క్షేమంగా రావడానికి ఎల్లమ్మదేవత ఆశీస్సులకొరకై ఈ తంతు చేస్తారు. బలిచేసిన జంతువు తల క్రిందపడగనే దానిపై తలపాగా కప్పుతారు. అది కుడివైపుకు ఒరిగితే శుభసూచకంగ పరిగణించి నేరాలు చేయడానికి బయలుదేరుతారు. ఎడమవైపుకు ఒరిగితే అశుభసూచకంగా ఎంచి ప్రయత్నం మానుకొని తిరిగివెళ్తారు. చెడుపని చేయుటలోకూడ వీరు దైవశక్తిని నమ్మినట్లు దీనివలన విదితమగుచున్నది. నేరానికి వెళ్లేముందు ఇట్టిదే ఇంకొక పరీక్ష జరుపుతారు. ఆంజనేయస్వామి విగ్రహమునకు పూలదండ వేస్తారు. ఆదండలో పూలరెబ్బలు పడినవైపునసరించి శుభా శుభములు నిర్ణయించెదరు.

దొంగతనంచేస్తూ పట్టుబడితే, ఎంత హింసించినా నిజంచెప్పరు. ప్రాణం పోతున్నా తోటిదొంగపేరు చెప్పరు. పైగా తమ అసలుపేరు చెప్పరు.

## కత్తెర:-

నెల్లూరుజిల్లాకు చెందినట్టి దొంగతనంచేసే స్వభావంగల 'వడ్డెర' జాతికి చెందినవారని ప్రతీతి. ఇదియొక సాహసమైన సంచారజాతి. దార్లు కొడతారు. బందిపోటుదొంగతనాలు చేస్తారు. వీరి జనాభా వెయ్యికిమించి ఉండదు. అత్యంత సాహసులు. దొంగతనం వీరికి ఉగ్గుతోపెట్టిన విద్య. జైలుకు వెళ్ళడం వీరికి నీళ్ళప్రాయం. గాఢనిద్రలో ఉన్నవారి మెడలలోను, జాతర్లలో జనసమ్మర్ధం ఎక్కువగా ఉన్నపుడు యాత్రికుల మెడలలోగల ఆభరణాలను తమ కత్తెరలతో లాఘవంగా కత్తిరించి తీసికొని పారిపోతారు. అందువలన వీరికి 'కత్తెర'లని పేరు సార్థకమైనది. చెవిపోగులు రాకపోతే అంతవరకు చెవిని కోయటానికి వెను దీయరు. ఎంతక్రూరమైన పని చేయటానికైనా సాహసిస్తారు. చాటున పొంచివుండి దెబ్బతీస్తారు. అవసరమైనపుడు పిక్కబలం చూపగలరు. వీరు అంతరాష్ట్రి దొంగలుగా ప్రఖ్యాతి చెందియున్నారు. ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలలో ఎక్కువగా తిరుగుతారు, రైళ్లలోకూడ వీరు దొంగతనాలుచేస్తారు.

చదువునేర్చుకొనిన వారిలోకూడ ఇంకను దొంగతనాలుచేసే వారుండడం చాల విచారాన్ని కలుగజేస్తున్నది. విద్యతోపాటు దొంగతనాలు చేయడంలో నవీన పద్ధతులు అవలంబించడం శోచనీయం. నాణ్యాలను, బంగారపు వస్తువులను సైతము మింగి పొట్టలో దాచగలరు. అవకాశము చిక్కినపుడు విరేచనాలకు మందుతీసికొని బయటకు రప్పిస్తారు. వీరు చాల తెలివైనజాతి. క్రూర హృదయులు. ద్రోహచింతన కలవారు. విశ్వాసఘాతుకులని చెప్పినను అతిశయోక్తిలేదు.

ఐనను, వీరిలో కొంతమంది పురుషులు, స్త్రీలుకూడ సెటిల్‌మెంట్లలో ఉన్నతవిద్య అభ్యసించినవారున్నారు. కొందరు ఉపాధ్యాయవృత్తి స్వీకరించారు. బాప్టిస్టుమిషన్‌కు చెందిన ఆస్పత్రులలో నర్సులుగా జీవిస్తున్నారు. ఆదర్శ ప్రాయంగా చేస్తున్నారు. వీరిని ఇట్టి మార్గాలలో శిక్షణ ఇచ్చి బాగుచేయవచ్చును.

కత్తెరజాతి చాల తెలివైనవారు కనుక వీరికేవృత్తి నేర్పినను సూక్ష్మంగా నేర్చుకొనగలరు, అభివృద్ధి లోనికి రాగలరు.

## గిరికలు:-

ఆదిలాబాదుజిల్లాలో కనపడే కొద్దిమందిగల సంచారజాతివారు వీరు. రోడ్ల ప్రక్కన చిన్న చిన్న గుడిసెలలో నివసిస్తారు. తెలుగే మాట్లాడుతారు. రంగుల రాట్నంవలన ప్రజలను త్రిప్పి సంగీతము పాడుతూ ప్రజలను సంతోషపరుస్తారు. గిరికలస్త్రీలు నృత్యంచేస్తూ అసభ్యకరమగు పాటలు పాడుతుంటారు. అందువలన జనం ఎగబడి రాట్నపుకుర్చీలలో కూర్చొని తిరుగుతూ, వారు పాడే పాటలను విని ఆనందించి వారికి బహుమతులను ఇస్తారు. జాతర్లలో రంగులరాట్న ప్రదర్శనాలు ఎక్కువ జరుగును. పురుషులు, చర్నకోలలతో శరీరంమీద బాదుకొని రక్తం కార్చుకుంటూ భయంకరంగా కనబడెదరు. ఇందువలన ప్రజలు భయపడి గాని, దయదలచిగాని వారికి డబ్బు, గింజలు వెంటనే ఇచ్చిపంపుతారు.

## రాజమల్లులు:-

వీరు భిక్షకవృత్తికి చెందిన సంచారజాతులు. వీరికి రెండోవృత్తి లేదు. సంవత్సరంలో ఎనిమిదినెలలుతిరుగుతుంటారు, వీరి ప్రధాననివాసస్థానం కరీమ్‌నగర్ జిల్లాలో సుల్తానాబాదుతాలూకా నీరుకల్లు గ్రామం. వీరు చాల చిన్నగుడిసెలలో నివసించుటకు అలవాటుపడినారు. తలదాచుకొనుటకే అవి పనికివచ్చును, రెండు లేక మూడుఅడుగుల కంటె ఎత్తుఉండవు. ఎండవారిని అంతగా బాధించదు. వీరు కొన్ని పక్షులను పెంచుతారు. పొట్టకూటికి తంటాలు పడడమే వారు నిత్యం చేసే పని. వారి దుస్తులు బలహీనంగా ఉండును. వారికున్నదానితో సంతృప్తి పడతారు. అసంతృప్తి వారిలో కనపడదు. స్త్రీలు 'రాజమల్లి' లాంటి వినసొంపుగల పేర్లు పెట్టుకొంటారు. వీరికి సంగీతం తెలియదు. పాటలు పాడరు. బుడబుక్కలవారికి గల డమరకం లాంటిది ఉపయోగిస్తారు. అడుక్కొనడం తప్ప వీరు ఇంకొకపని చేయరు.

వీరుగాక లంబాడీలు (సుగాలీలు) ఎరుకల, (కురవనులు). యానాదుల, చెంచుల గురించి నేను రచించిన "ఆదిమవాసులు" (దీనాతిదీనులు: 1) అను గ్రంథంలో విపులంగా చర్చించాను. చర్విత చరణం అవును గనుక మరల ఇచట వారిని గురించి వ్రాయలేదు. ఇంతవరకు ఆంధ్రప్రదేశ్‌కు చెందిన సంచార జాతులను గురించి మాత్రమే వివరించడం జరిగినది.

వీరుగాక దక్షిణభారతదేశంలో నివసిస్తున్న ఈ క్రింది సంచారజాతులను గురించికూడ కొంత తెలిసికొనవలసియున్నది.

## తోడాలు:-

వీరు పశువులను పెంచి జీవించు ఒక సంచారజాతి. వీరు నీలగిరికొండల ప్రాంతంలో నివసిస్తున్నారు. వీరి సంఖ్య ఇప్పుడు చాల తగ్గిపోయినది. ఐనను మద్రాసునగరంలోనే 600 కుటుంబాలవరకు ఉన్నట్లు తెలియుచున్నది. వీరు పశువులను ముఖ్యంగా గేదెలను పెంచెదరు. పశువులే వారి సంపద. తోడాలు నిరాడంబరంగా జీవిస్తారు. వ్యవసాయమనిన వీరికి గిట్టదు. బంగాళాదుంపలు పండించుటకై ప్రభుత్వం వీరికి ఎంతో భూమి ఇచ్చినది. కాని వీరు ఆ భూమిని సాగుచేయలేదు. పైగా ఆ భూమిని వ్యవసాయము చేసికొనుటకై ఇతరులకు కౌలు కిచ్చుట జరిగినది. తోడాలు చిన్నచిన్న ఇండ్లలో నివసిస్తారు. వీరి గ్రామాలకు 'మాండ్' అని పేరు, "మాండ్" గ్రామంలో అరడజను ఇండ్లకంటె ఎక్కువ ఉండవు. వీరిలో ఇటీవలవరకు బహు భర్తృత్వ ఆచారం కలదు. ఇప్పుడు పూర్తిగా నశించినది.

తోడాలను మన "లంబాడీలకు" పోల్చవచ్చును. ఈ రెండు జాతులలో ఎక్కువమంది తిరుగుట మాని స్థిరనివాస మేర్పరచుకొనుట జరిగినది. బహు భర్తృత్వ పద్ధతి వీరిలో అమలులోనున్నపుడు, తోడాలలో సుఖరోగములు ఎక్కువగా ఉండి, దానివలన వారు క్రమంగా క్షీణించుట జరిగినదని చెప్పెదరు. న్యూగినియాలోకూడ బహు భర్తృత్వ ఆచారముగల "అర్పాలు" "ముడగములు" జాతులవారిలో ఇట్టి వ్యాధులే ఉన్నవనియు అందువలన వారి సంఖ్య క్రమంగా క్షీణిస్తున్నదని చెప్పుచున్నారు.

పశువులనుపెంచే అలవాటు క్రమంగా అభివృద్ధి అయినది. ముందు జంతువులను సంతోషానికి పెంచడంజరిగింది. క్రమంగా వాటిని ఆహారంగా చేసికోవడం జరిగింది. మానవుని జీవితయాత్రలో ఇట్టిమార్పులు ఎన్నో జరుగును గదా! సృష్టితో పోరాడి దానిని స్వాధీనం చేసికొనుటకే మానవులు మొదటనుండి తీవ్రమైనకృషి చేసియున్నారు. అందుచే ఆహారమును సమకూర్చుకొను మానవుడు క్రమంగా పశువులను పెంచుటకు అలవాటుపడెను. క్రమంగా ఇది వ్యవసాయానికి దారితీసింది.

తోడాలు ఇప్పటికీ పశువులను పెంచుటయందే వీరికి మక్కువ కలదు, సంతృప్తికలదు. వారి సంపద పశువులనుబట్టే లెక్కింతురు. వారి పిల్లలకు విద్య లేవిమాట వాస్తవమే. వైద్యసదుపాయం లేదు. పశువులకు వైద్యసదుపాయం అసలే లేదు. ప్రయాణసౌకర్యాలు లేవు. ఇతర ప్రపంచంతో సంబంధం లేదు. ఐనను వారు సంతోషంతో ఉన్నదానితో సంతృప్తిపడుతూ జీవిస్తున్నారు. వీరు ఆరోగ్యంగా ఉంటారు. దృఢకాయులు. పశువుల పెంపకం మనదేశానికి ఎంతో అవసరం. అట్టి పరిశ్రమ జీవనోపాధిగా గావించుకొనిన తోడాలులాటి సంచార జాతుల అభివృద్ధికి ప్రభుత్వం ఎంతో చేయవలసియున్నది.

## కురంబలు:-

వీరు మన 'గొల్ల'' జాతి లాంటివారు. మేకలను పెంచెదరు. మేకలను పెంచడమే వారి వృత్తి, అవే వారి సంపదకూడా. వాటిని కసాయి దుకాణమునకు తీసికొని వెళ్లటమే వారి ప్రధాన ధ్యేయం, వీరూ క్రమంగా స్థిరనివాస మేర్పరచుకొని వ్యవసాయం చేసి జీవించుచున్నారు. కురంబలు లోగడ ఆంధ్రప్రదేశంలోగల బళ్లారిజిల్లాలో ఎక్కువమంది ఉన్నారు. వీరిపుడు కంబళ్లు, ఉన్ని బట్టలునేసి ఆర్థికంగా బాగుపడినారు.

## మాలపండరములు:-

కేరళరాష్ట్రంలో సంచరించు ఒకజాతి ఇది. వీరు పర్వతప్రాంతాలలో ఎక్కువ నివసిస్తారు. వీరికి ఇతర ప్రపంచంతో ఎక్కువ సంబంధం లేదు. ఇతరులూ వీరితో సంబంధం ఏర్పరచుకొనుటకు అవకాశం ఎక్కువ లేదు. వీరి జన సంఖ్య బహుతక్కువ.

వీరు రోజుకొకసారే ఆహారం తీసికొంటారు. అదీ సాయంసమయంలో. పగలంతా చేపలను, తాబేలులను పట్టుతూ వేటాడుతూ ఉంటారు. అడవిలో కనపడు మూలికలు, వ్రేళ్లు, దుంపలు తినెదరు. వీటిని తేనెతో కలిపి ఆరగించెదరు. వీరు ఒక గడ్డపారను, విల్లంబును పట్టుకొని తిరిగెదరు. వారివెంట ఒక కుక్క

ఉండడం వారికి సరదా. వీరు గుహలలోను, చెట్లతొర్రలలోను ఎక్కువ నివసిస్తారు. తెల్లవార్లు 'మంట' ఉంచుతారు. అగ్గిపెట్టెలు లేనప్పుడు చెకుమికితో నిప్పు రాజేసేవారు.

వీరిలో కొన్ని ఆచారాలున్నాయి. మేనమామకూతురిని తప్పక పెండ్లి చేసికోవాలి. లేనిచో కుల పంచాయతీ ముందు సంజాయిషీ చెప్పుకోవాలి. నిరాకరణ సకారణంగా లేనిచో ఆ యువకుని సంఘ బహిష్కారం చేసెదరు. వీరిలో స్త్రీల సంఖ్య తక్కువ. అందువలన సోదరులు పాండవులలె ఒక భార్యను చేసికొనే ఆచారము వీరిలో ఉన్నది.

మాలపండరములు గుట్లను, చెట్లను, సెలయేరులను పూజించే అలవాటున్నది. ఇప్పటికి విద్యావంతులగు హిందువులలోకూడ ఈ అలవాటు ఉన్నదికదా! మరీ ప్రాచీనకాలంలో చెట్ల ఆకులను వీరు వస్త్రధారణచేసేవారట. క్రమంగా ఈ పద్ధతి ఇప్పుడు మారినది.

వీరు వారానికంటె ఎక్కువకాలం ఒకచోట ఉండరు. వీరు ప్రాంతాలను పంచుకొంటారు. ఒక ప్రాంతంవారు ఇంకొక ప్రాంతానికి వెళ్లరు, వేటాడటమే వీరి ప్రధానవృత్తి. వీరికి బీహార్‌లోగల బిరోరులకు పోలిక కలదు.

ఇరులు:-

వీరు యానాదులు, చెంచులు తెగకు చెందినవారని మానుషశాస్త్రజ్ఞులు వ్రాసియున్నారు. చరిత్రగతి వీరిని తూర్పుఘాటులనుండి, పశ్చిమఘాటులకు తరలింపచేసినది. మొగల్‌సామ్రాజ్య నాశనము, నైజాము అవతరణ, మహారాష్ట్రపరిపాలకుల పోరాటం, భామినీసుల్తానుల పతనం, ఈస్టుఇండియాకంపెనీ ఆక్రమణ మున్నగువాటికి జరిగిన యుద్ధములు ఇందుకు కారణాలు కావచ్చును.

వీరికి స్వంత ఆస్తి లేదు. నిరంతరము సంచారము చేయుటే వీరి ప్రవృత్తి. వీరిని నేరస్థజాతుల జాబితాలో జమకట్టబడినారు. కాని ఇది అన్యాయమని పలువురి చరిత్ర పరిశోధకుల అభిప్రాయము. వీరి జనాభా లక్షకుపైనే ఉండవచ్చును.

నేరపు స్వభావంకలవారిని వ్రేళ్లపై లెక్కించవచ్చును. వీరిలో అవసరంకొద్ది ధాన్యం దొంగతనం మాత్రమే వీరు చేస్తారు. కన్నపు దొంగతనాలు, దోపిడి దొంగతనాలు వీరు చేయరు. వీరు తమిళనాడులో ఎక్కువగా ఉన్నారు.

## నిర్షికారీలు:-

క్రమంగా నశిస్తున్న నేరపుజాతి ఇది. వీరు దోపిడీలు చేయుటలో సుప్రసిద్ధులు. ఇండ్లబయట పారేసిన విస్తళ్లలోని ఆహార శేషమును తినే అలవాటు కలదు. వీరి స్త్రీలు ఇండ్లముందుకు వచ్చి భయంకరంగా అరుస్తారు. ఈ అరుపులు భరింపరానివి. ఈ అరుపులు విని భయపడి స్త్రీలు వీరికి ఏదో ఒకటి ఇచ్చి వెంటనే పంపుతారు. కాపుసారావ్యాపారం వీరి ప్రధానవృత్తియని తెలుస్తున్నది.

## కొరవలు:-

ఆంధ్ర పశ్చిమప్రాంతంలో వీరిని కొరవలనియు కోస్తా ఆంధ్రప్రదేశ్‌లో ఎరుకలనియు పిలువబడుచున్నారు. వీరుకూడ బుట్టలల్లి అమ్ముట, ఉప్పు అమ్ముట, పప్పుదినుసులు, కరివేపాకు అమ్మి జీవిస్తుంటారు. దీనికితోడు దొంగతనంకూడ వీరికి వంశపారంపర్యంగా అబ్బిన విద్య. వీరి స్త్రీలు మాటకారులు. ఎరుకచెప్పి ప్రజలను మెప్పించి బహుమతులను స్వీకరిస్తారు. వీరినికూడ ఎరుకలతోపాటు షెడ్యూల్డు జాతులలో ప్రభుత్వం చేర్చినారు.

ఈ సందర్భంలో ప్రపంచ మానుష శాస్త్రవేత్తలలో ఒకరును, విదేశీయుడయ్యును తన జీవితసర్వస్వము భారతదేశపు ఆదిమవాసుల ఉద్ధరణకు కృషిచేసి ఆదిమవాసులపై ఉద్గ్రంధములు రచించిన డాక్టర్ ఎల్విన్ ఇట్లు వ్రాసియున్నారు. "ప్రపంచములోగల ఆదిమవాసులలో ముఖ్యంగా సంచారజాతులలో అతి ప్రాచీనమైన జాతులు దక్షిణభారతదేశంలో నివసిస్తున్నట్లు చరిత్రాధారాలు ఋజువు చేయుచున్నవి. నీలగిరికొండలలో, నల్లమలై పర్వతాలలో అట్టి జాతులున్నారు"

ఏమైనా, భారతదేశంలో ఏ ప్రాంతంలో ఉన్నను సంచారజాతుల యందు కొన్ని ఆచార వ్యవహారాలలో, నడవడికలలో, స్వరూప స్వభావాలలో పోలిక లుండుట గమనార్హము.

ఉత్తరహిందూస్థాన్‌లోగల ముఖ్యమైన సంచారజాతుల (ఘుమంతుజిన్) గురించికూడ తెలిసికొనుట అవసరము.

## గోడియాలోహార్లు:–

వ్యాపార సంచారజాతులగురించి తెలిపినపుడు వీరిని గురించి కొంతవరకు చర్చించడం జరిగింది. వీరు శతాబ్దాలతరబడి సంచారజాతిగనే ఉన్నారు. వీరు లోహపు పని ఎక్కువ చేయుదురు గనుక వీరికీ పేరు వచ్చినది. వీరు బండ్లు వ్యవసాయపు పనిముట్లు పనిచేసే శిల్పులు. రైతులకు ఎక్కువ సహాయపడే జాతి ఇది. వేసవికాలములో వ్యవసాయపు పనులు ఉండవు కనుక వారొకచోట విశ్రాంతి తీసికొంటారు. ఈ సమయాలలో వ్యవసాయపు పనిముట్లను తయారు చేసికొని సంచారానికి సిద్ధపడెదరు. వీరు పెద్ద ఎద్దులబండిపై సంచరించెదరు. వారు ముందుగా తయారుచేసిన వ్యవసాయపనిముట్లను ఇందమర్చుకొని అమ్ముకొనుతూ పోవుచుందురు. గ్రామాలలో ఆగినపుడు వారి ఎద్దులబండియే వారికి నివాసము. వీరు ఆయుధాలు తయారుచేయుటలో బహునిపుణులు. రాజపుత్రులు ఉపయోగించు వివిధ ఆయుధాలు వీరు తప్ప ఇంకొకరు తయారుచేయలేరు. దీనినిబట్టి కొన్ని శతాబ్దాలు రాజపుత్రులకు మొగల్‌రాజులకు జరిగిన ఘోరయుద్ధంలో ఆయుధాలు తయారుచేసి యుద్ధానికి వీరు తోడ్పడినారని తెలియుచున్నది. రాజ్‌పుటానా అనగా ఇప్పటికి రాజస్థాన్‌లో వీరు ఎక్కువ నివసిస్తున్నారు. వీరు ప్రక్కనేగల కాశ్మీర్, జమ్మూరాష్ట్రాలలోకూడ తిరుగుతుంటారు. ఢిల్లీ పట్టణంలో నైతే సరేసరి, రోడ్ల ప్రక్కన వీరు పనిచేస్తూ కనబడుతునేఉంటారు. ఇటీవల వీరు రైల్వేకంట్రాక్టర్లకు, తదితర కార్ఖానాలవారికి లోహపు పనిముట్లు చేసి తోడ్పడుతున్నారు వీరు కష్టజీవులు పగలంతా పనిచేస్తూనే ఉంటారు. వీరి పనిముట్లకు గిరాకీ ఉన్నది. మిషన్లతో తయారయే వాటికంటె వీరు చేసేవి ఎక్కువకాలం మన్నుటేకాక చౌక కూడ. అందువలన గ్రామస్తులు వీరివద్దనే ఈ పనిముట్లను ఎక్కువ కొంటారు.

లోగడ చెప్పినట్లు వీరు ఉత్తరప్రదేశ్, బొంబాయి, పంజాబు, కాశ్మీర్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఢిల్లీ ప్రాంతాలలో ఎక్కువ, చెదురుమదురుగా హిమాచల్‌ప్రదేశ్‌లో తిరుగుతుంటారు. కేంద్రప్రభుత్వం నియమించిన ఉప సంఘంవారు

వారి నివేదికలో వీరిని గురించి వ్రాసియున్నారు. వీరి చరిత్రను పరిశీలిస్తే వీరు కేవలము వ్యవసాయపనిముట్లను చేయు లోహకారులు మాత్రమేకాక పలువిధము లైన ఆయుధాలు చేసే శిల్పులనియు, వీరికి చదువంటే ఇప్పటికీ ఆసక్తిలేదనియు, యుద్ధంచేయడం వీరికి అసలే తెలియదని వ్రాసియున్నారు.

వీరికి స్థిరనివాసము కలుగచేయుటకు కొన్ని ప్రయత్నాలు జరుగకపోలేదు. కాని అవి ఫలించలేదు. అధికారులకు, సాంఘిసేవకులకు వీరట్టి అవకాశమివ్వ లేదు. పోలీసులకు వీరెప్పుడూ భయపడలేదు. వీరి పనేమో వారేమో కాని ఇతర వ్యాసంగాలేమి వీరికి తెలియవు. లోహర్లు ఓపికతో, కష్టపడి పనిచేసే తెలివి గల జాతియని సబ్ కమిటీ నివేదికలో స్పష్టంగా వ్రాయబడినది.

## కంజార్ జాతులు.-

కంజారులు రాజస్థాన్‌లో, పశ్చిమహిందూస్థాన్‌లో ఎక్కువగా ఉన్నారు. పంజాబ్, ఉత్తరప్రదేశ్‌లోకూడ తిరుగుతుంటారు. రాజపుత్రుల సంతతివారని వీరు గొప్పగా చెప్పుకుంటారు. వీరిని నేరపుజాతిగా ప్రభుత్వం గుర్తించి వీరిపై ఆంక్షలను విధించిరి. సంస్కృతపదం "కహానచర" నుండి ఈ పేరు వచ్చినదని చెప్పుదురు. "కహానచర" అనగా అడవిలో తిరిగేవారని అర్థము. వీరు రాజపు త్రులవద్ద ఉండి వారికి సేవచేసేవారని చెప్పెదరు. వీరు 'మానగురు' సంప్రదా యానికి చెందినవారు. వీరిలో భార్యను అమ్ముకొనే దుష్టాచారం ఉన్నది. ఇరవై అయిదురూపాయలకే ఒకరి భార్యను సులభంగా కొనవచ్చును. వీరికి జబ్బు వచ్చినపుడు దేవతలను సంతృప్తిపరచుటకు బాలలు కలియుచోట అన్నాన్ని, మాంసాన్ని, మద్యాన్నికూడ పాతిపెట్టడం కద్దు. ఆంధ్రప్రదేశంలో కొన్ని నేరపుజాతులలోగల కొన్ని భయంకరాచారాలు ముఖ్యంగా నేరం చేయు లేదని నిరూపించుటకు కాలే కాలే గడ్డపారను చేతితో ముయ్యటం మున్నగు నవి వీరిలోను కలవు. దొంగతనానికి పోయేటప్పుడు శకునాలు చూస్తారు. వీరు దోపిడిదొంగలుగా ఎక్కువగా వ్యవహరిస్తారు. వీరికి కులపంచాయతీ కలదు. వీరు చాల తెలివిగలవారు. కడుజాగ్రత్తతో ఎప్పుడూ ఉంటారు. చట్టమంటె లెక్క లేదు. సాహసమైన, భయంకరమైన, జిత్తులుగల, క్రూరజాతి ఇదేనని మానుషశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. వీరి స్త్రీలు కడునేర్పరులు. వీరు మంచి మంచి

స్తులు ధరించి నాట్యం చేయగలరు. వీరు ఇతర పురుషులను ఆకర్షించి లోబరచు
గలరు.

## ౌరియవాలు:-

వీరు ఉత్తరహిందూస్థాన్ ప్రాంతమంతటిలో కనపడెదరు. వీరూ
జపుత్ర వంశానికి చెందినవారమని చెప్పుకొనుట కద్దు. మానుషశాస్త్రవేత్త
గు ముజుందార్ వీరిని గురించి వ్రాయుచూ, "వీరు స్త్రీలకు ఎక్కువ స్వేచ్ఛ
చ్చియున్నారు. వీరు హీనజాతికి చెందిన స్త్రీలను, భర్తృవిహీనులైన స్త్రీలను,
రిలో చేర్చుకొనుటకు ఎల్లప్పుడును ప్రయత్నించి వారిజాతిని ఎక్కువ చేసికొను
దురు. స్త్రీలు వ్యభిచరించుటకు అభ్యంతరంపెట్టరు. స్త్రీలను ముందుగా గ్రామా
కు పంపి పురుషులను వశపరచుకొనేటట్లు చేసి ఆ గ్రామంలో ధనవంతుల సమా
రం సేకరించెదరు. బందిపోటు చేయుటకు ముందుగా ఈ ప్రయత్నాలు అవ
ంబించెదరు. పెద్ద పెద్ద డబ్బుగల వాళ్లవలె నటించి వారి బిడ్డలను ధనవంతుల
చ్చి పెండ్లి చేసి ఆ బిడ్డతో ఆమె తెచ్చిన ధనము, నగలతో పారిపోయెదరు". వీరికి
ర్దవంతమైన పంచాయతీపద్దతి కలదు. దీనిని గురించి మరొకచోట వివరంగా
లిసికొనగలరు.

## ోమ్ులు:-

మానులశాస్త్రవేత్త క్రూక్స్ వీరిని గురించి వ్రాయుచూ వీరు బహు ఆదిమ
ంతతికి చెందినవారనియు, హంతకులనియు అభివర్ణించియున్నారు. వీరి ఆకా
మే భయంకరమైనది. వీరిని గ్రామం వెలుపలనే ఉండనిచ్చేవారు. వీరి ఆచార
ులు చాల నికృష్టములైనవని తెలియుచున్నది.

వీరొకప్పుడు చాల ఉన్నతస్థానంలో ఉన్నట్లు చరిత్రకారులే వ్రాస్తున్నారు.
ోమ్‌రాజ్యమే ఒకప్పుడున్నట్లు తెలియుచున్నది. మధ్యఆసియాలోనుండి కొన్ని
తులు ఇక్కడకు వలసవచ్చి వీరిని తరిమి వారు ఆక్రమించుకొనిరట. డోముల
రట కొన్ని పట్టణాలు ఇప్పటికీ కలవు. డోంపుర, డోమాలి, డోమగిరి
న్నగువాటిలో కొన్ని.

డోములు అంటరానివారుగా చూడబడుచున్నారు. వీరికి జైలంటే భయమే లేదు. డోముస్త్రీలు బలిష్ఠంగా ఉండి, పురుషులకంటె తెలివిగలవారుగ ప్రసిద్ధి చెందియున్నారు. వయస్సుమళ్లిన స్త్రీలు మూలికలను సేకరించి అమ్మెదరు.

వీరూ దోపిడిచేసే జాతికి చెందినవారే. అరణ్యాలలో ఉండి, క్రూరమృగాలను వేటాడుతుండెదరు. అడవులలోగల వ్రేళ్లను, మూలికలను సంపాదించి అమ్మి కొంతవరకు జీవనం చేస్తున్నారు.

## కంజారాలు:-

వీరు పంజాబు, ఉత్తర రాష్ట్రాలలో ఎక్కువగా ఉన్నారు. వీరిలో పన్నెండు ఉపజాతులున్నాయి. వీరు రాజపుత్రులకు భటులుగా సేవచేసినట్లు చెప్పుకొనెదరు. తరువాత క్రమంగా ఈ పని లేకపోవుటచే తిరుగుబోతువారైనారని చెప్పెదరు. 'మాన' లేక 'మానగారు' సంతతికి చెందియున్నారని వీరును చెప్పుకొనెదరు. ఇతను సుప్రసిద్ధ కుస్తీదారనియు, మొగల్‌సామ్రాజ్యములోగల గొప్ప కుస్తీపట్టువానితో పందెంగట్టి అతనిని ఓడించుటతో ఇతని పేరు ప్రసిద్ధిలోనికి వచ్చినదనియు చెప్పెదరు. వీరి స్త్రీలు గొప్ప నాట్యకత్తెలనియు, త్రాడుపై చాకచక్యంగా నాట్యమాడగలరనియు వీరు ధనవంతుల వద్ద,ముఖ్యంగా గుజార్‌రాజుల వద్ద వారి ప్రదర్శనములిచ్చి ఎన్నో బహుమతులు పొందినారట. అందులోని ఒక ప్రసిద్ధ నర్తకి ఒకపరి నాట్యంచేయుచూ తన తోటినర్తకి కుట్రవలన పడిపోయి అవసానదశలో వారిజాతికి ఈ క్రింది సూచనలు చేసినట్లు చెప్పెదరు. 1) త్రాటిపై నాట్యం చేయరాదు. 2) పైపల్‌వృక్షముక్రింద జూన్‌నెలలో కూర్చొనరాదనియు 3) కుండతో నీయితెస్తున్నపుడు నెత్తిపై ఏమి పెట్టుకొనరాదనియు, 4) దీపావళిరోజున ఎట్టి దీపప్రదర్శనలు చేయరాదనియు, 5) పారుతున్న నీరును త్రాగరాదని. ఇప్పటికీ ఈ జాతివారు వీటిని ఆచరిస్తున్నారు. తనను కుట్రపన్ని పడవేసిన నర్తకీ ఆమె సంతతి, నాట్యంచేస్తూ, పాడుతూ, వ్యభిచారవృత్తితో జీవించెదరని శపించినదట.

## కొర్వాల్లు:-

కార్వాల్లు, భట్టులు ఒకే జాతికి చెందినవారు. వారు వివిధ ప్రాంతాలలో ఉండుటవలన వివిధ పేర్లతో వ్యవహరింపబడుతున్నారు. అరబిక్ మాట "క్వార్వాల్" నుండి ఈ పేరు వచ్చినది. క్వార్వాల్ అనగా వేటగాడు అని అర్థము. వీరు వేటగాండ్లకు రాజులని చెప్పెదరు. కాలక్రమేణ సంచారప్రవృత్తి అలవాటై అడవులపాలైనారు.

1వ శతాబ్దికి చెందిన 'గుల్ఫి' అనే ఒక సుప్రసిద్ధ దొంగనాయకుని సంతతి వారమని వారే చెప్పుకుంటారు. సుప్రసిద్ధ ఆదిమవాసులగు 'నాగ' జాతివారి రూపురేఖలు వీరిలో కనపడును. వీరు దృఢకాయులు, నలుపురంగు, కోలముఖం, విశాల వక్షస్థలం కలిగిఉన్నారు.

వీరు పశువులను దొంగిలించుటలో అతి నిపుణులు. వీరు మేకలను సులువుగా అపహరించగలరు. వాటిని దాచగలరు. గొంతుపిసికి, సులభంగా చంపివేయగలరు. బండ్లమీద రవాణా చేయునపుడు ధాన్యాన్ని దొంగిలించుటలో నేర్పరులు.

కార్వాల్ల ముఠాకు స్త్రీయే నాయకత్వం వహించును. ఆమెను 'ముఖ్య' అని పిలిచెదరు. ఈ 'ముఖ్య'ను కోడండ్లనుండే ఎన్నుకొనెదరు. సాధారణంగా పెద్దకోడలే ఈ బాధ్యత వహించును. ఆమె ఇష్టప్రకారం కుటుంబం అంతా నడువవలసియున్నది. బీహార్ ప్రభుత్వం వీరిని నేరపుజాతిక్రింద పరిగణించి వీరిపై నిఘా ఉంచినది.

## మీనాలు:-

జయపూర్ మహారాజా పరిపాలించిన దేశంలో కొంతభాగం ఒకప్పుడు వీరి క్రింద ఉండేదని మేజర్ పౌలెట్ వ్రాసియున్నారు. రాజపుత్రులలో వీరికి ఒక హోదా ఉన్నది. జయపూర్‌కు వీరు నమ్మినబంటులు. వీరు ఇండో ఆర్యన్ జాతికి చెందినవారు. అమీర్ ఇప్పటికి వీరికి ప్రధానస్థానంగా ఉన్నది. నహార్ఘారకోట ఇంకను వీరి స్వాధీనంలో కలదు. అంకార్ సామ్రాజ్య గవర్నరగు

మావసింగ్ అనునతను మీనారాజ్యమును తొలగించి కచ్వన్ వంశస్తులకు స్వాధీనం చేసియుండెను. ఇప్పటికి ఈ రాజ్యమునకు క్రొత్తరాజుకు పట్టాభిషేకము చేసేటప్పుడు మీనాజాతి నాయకుడు ఆ రాజుకు తన రక్తంతో తిలకం దిద్ది ఆశీర్వదించుట ఆచారమైయున్నది. దీనినిబట్టి రాజపుత్రులలో వీరికెంత ప్రాధాన్యత ఉన్నది తెలియగలదు.

వీరిలో రెండువర్గాలు కలవు. జమిందారీజాతి, చౌక్‌దార్‌జాతి. మీనారాజ్య పతనమైన తరువాత ఈ విభజన వచ్చినది. తరువాత వచ్చిన రాజుకు అనుకూలంగా ఉన్నవారికి గ్రామాలు, భూములు దానమివ్వబడినవి. వ్యతిరేకించిన వారు అడవులపాలైరి. తరువాత వీరు క్రమంగా గత్యంతరంలేక దొంగతనం వృత్తిగా జీవించడం ప్రారంభించిరి. ఇష్టమైనవారు చౌక్‌దారులుగా నియమింపబడిరి. క్రమంగా వీరు రహస్యపరిశోధక శాఖలో నియమింపబడిరి. గ్రామాలలో ప్రజలకు వీరిని చూస్తే భయం. గ్రామంలోకి వీరు వస్తే తృణమో పణమో ఇచ్చి వీరిని సాగనంపుటకు అలవాటుపడిరి.

## పాఖీవారా:-

వీరు మహమ్మదీయులకు చెందిన ఒక నేరపుజాతి. సన్సియా అనే జాతికి ఉపజాతియని వీరు చెప్పెదరు. వీరికి మియాలు అనే ఇంకొకపేరున్నది. వీరు పంజాబులోగల సైర్‌కోటజిల్లాలో ఎక్కువ కనపడుచుండెదరు.

రాజపుత్రులకు చెందిన ఒకని వంశంవారమని వీరు చెప్పుకొనెదరు. ఒక రాజపుత్రరాజు తన వంశంలో ఒకనికి మరణశిక్ష విధించాడట. ఈ దోషి అడవులకు తప్పించుకొని ఒక సంచారజాతి శరణు కోరినాడు. సైనికులు వీరి వెంటబడి తరిమిరి. వీడు సంచారజాతివారివద్ద దాగి ఉన్నాడని వాళ్ళ అనుమానించి ఆ జాతివారు నివసించు స్థలాలన్నిటిని గాలించి వేశారు. ప్రతి గుడిసెను తనిఖీచేశారు. కాని అతనిని వీళ్ళ తమ నాయకుని కూతురిగదిలో దాచిపెట్టారు. ఆడవాళ్ళున్నగదిలో సోదాచేసే ఆచారం లేదు. అందువలన అతను తప్పించుకొని కృతజ్ఞతాపూర్వకంగా ఆ నాయకుని కూతురినే వివాహము చేసికొనుటకు అంగీకరించి వివాహమాడెను. పాఖీవారు ఇతని సంతతివారని చెప్పుకొనెదరు.

వీరినిగురించి ఇంకొకగాథ కలదు. రాజపుత్రులలో ఒకరాజు చనిపోయిన పుడు, ఆ రాజ్యముకొరకై అంతర్యుద్ధము జరిగినది. దీనిఫలితంగా ఇద్దరు రాజపుత్రులు పారిపోయి పంజాబులో తలదాచుకొనిరి. ఒకడు జమీందారుగా స్థిరపడిపోయెను. రెండవవాడు 'పకీ' అనగా గుడిసెలో దాక్కొనెను. అందువలన ఈ రెండవవాని వంశమే వీరని కొందరు చెప్పుదురు. తరువాత ఔరంగజేబు కాలంలో మహమ్మదీయమతం వీరు స్వీకరించారట.

## సన్సియాలు:-

వీరు మేవారు అజ్మీరుకు చెందినవారని ప్రతీతి. వీరిలో రెండు ఉపతెగలు కలవు. ఒకటి కల్కా, రెండవది మాలా. మాక్లగన్ అనే మానుషశాస్త్రవేత్త వీరిని రెండు భాగాలు క్రింద విభజించినాడు. (1) స్థిరపడినవారు, (2) సంచారం చేయువారు. సంచారము చేయువారిలో ఇంకొక రెండు ఉపతెగలు కలవు.

వీరి నివాసము భరత్‌పూర్ అని వ్రాయబడినది. వీరిని గురించి ఒక గాథ కలదు. ఒకరాజు తన కూతురిని తప్పుదారిత్రొక్కినదని బహిష్కరించెను. ఆమె అజ్ఞాతంలో ఉన్నపుడు ఒక కొడుకును కనెను. ఈ కొడుకు పెద్ద దొంగగా మారిపోయెనట. వీడికి బైందు, మాలా అను ఇద్దరు కొడుకులు పుట్టిరి. వీడు ఇరవై మూడు సన్సీ గోత్రికులను పుట్టించిరట.

బెంగాల్, రాజపుటానాలోగల సన్సియాలు అడవిలో నివసించు ఒక పెద్ద దొంగ సంతతికి చెందినవారని చెప్పుకొంటారు. వీరు రాజపుత్ర సంతతియే అని వీరి వాదన.

తూర్పుపంజాబులో సన్సీలు కంజారులని, పశ్చిమసంయుక్త రాష్ట్రంలో హబురాలని పిలువబడుచున్నారు. కనుక ఈ సంచారజాతులు ఒక ప్రత్యేక జాతికి చెందినవారు కాదని వీరు హిందూదేశంలో నివసిస్తున్న అన్ని కులాలకు సంబంధించిన వారేయని మానుష శాస్త్రజ్ఞులు ఋజువుచేసియున్నారు. అనగా సంకీర్ణజాతి వారని తెలియుచున్నది.

పీరు పేరువడిన దోపిడిదారులు. దోపిడిచేసి వారు దొంగిలించిన కొన్ని వస్తువులను ఒక గ్రామం దగ్గర వదలి వెళ్లెదరు. పోలీసులకు ఆగ్రామంపై అనుమానపడుటకు అవకాశం కలుగ చేసెదరు. వారు దొంగిలించిన వస్తువులను ఈ విధంగా దాచెదరు. (1) ఒక చెట్టుక్రింద పాతి పెట్టెదరు. (2) వాళ్ళ మంచాల క్రిందనో, పొయ్యిల క్రిందనో దాచెదరు. (3) వాళ్ళ గుడిసె గుంజలక్రిందనో, లేక వారి పశువులను కట్టివేయు స్తంభాలక్రిందనో పూడ్చెదరు (4) వెండి బంగారాలను కరిగించి పై విధంగానే దాచెదరు. (5) రొఖ్ఖాన్ని నోట్లక్రింద మూర్చి గుడిసెలకప్పులో దాచెదరు (6). స్త్రీలు కట్టుకొన్న చీరెలోపల వస్తువులనుదాచెదరు.

స్త్రీలు దొంగతనం చేయుటలో పురుషులకు చాల తోడ్పడెదరు. ముందుగా వెళ్లి సమాచారం సేకరించి చెప్పెదరు. ఇంతచేసినను వీరికి ఆస్తి లేదు. అప్పటికి, ఇప్పటికీ నాఅనేది లేనేలేదు. తరాలబడి వీరు సంచారజాతిగనే ఉన్నారు.

ఠగ్‌లు:-

ఇండియన్ పోలీసు సర్వీస్‌లో ఉన్నతాధికారిగా పనిచేసిన శ్రీ యస్. వేణుగోపాలరావు వీరిని గురించి ఒక పెద్ద గ్రంధమే వ్రాసియుండెను. వీళ్లు 13వ శతాబ్దానికి చెందినవారనియు, జలాలుద్దీన్ ఫిరోజ్ ఖిల్జీ రాజ్యపాలన చేస్తున్నప్పటి కాలంనుండియు ఉన్నారని వ్రాసియున్నారు. హత్యలు చేయుటలో వీరు బహు నేర్పరులు, చాల సాహసము కనపరచెదరు. ప్రయాణీకులలో కలిసిపోయి, వారితో స్నేహంచేసి ప్రయాణం చేస్తుంటారు. రాత్రిళ్లు ఒక్కచో వరుండినపుడు ఠగ్‌లు ప్రయాణీకులపైబడి వారిని హత్యగావించెదరు. వారి దగ్గర ఉన్నదంతా దోచుకొనెదరు. శవాలను గోతులలోనో, కంచెలలోనో పారవేసి పారిపోవుదురు. వీరిని అణచుటకు అనేక ప్రయత్నాలు గావింపబడినవి, సర్ స్లీమన్ అధికారం లోకి వచ్చిన తరువాత వీరిపై కఠిన చర్యలు తీసికొనబడి వారిని అణచివేయుటకు ప్రయత్నములు ఎక్కువగా గావింపబడినవి. అందువలననే సర్ స్లీమన్‌కు 'ఠగ్గి స్లీమన్' అని పేరుకూడ వచ్చినది ఇందుకు తొమ్మిది సంవత్సరములు (1826-35) పట్టినది. ఇందుకు లార్డ్ విలియమ్ బెంటిక్ అనేక చట్టములను గావించి ఇందుకు పూర్తి మద్దతు ఇచ్చియుండెను. అందువలననే ఠగ్‌లను అణచివేయుటకు చేసిన ప్రయత్నములు కొంతవరకు సఫలీకృతమైనవి,

వీరిని బాగు చేయుటకు క్రిమినల్ సెటిల్‌మెంట్లు స్థాపింపబడినవి. వీటిని శాల్వేషన్ ఆర్మీవారు చాల సమర్థతతో నడిపిరి. వీరికి శాల్వేషన్ ఆర్మీవారు చేసిన సేవ ప్రశంసింప తగినది. మన రాష్ట్రంలో ఎరుకలవారికి ఏర్పాటుచేసిన స్టువర్టు పురం సెటిల్‌మెంటును వీరే పరిపాలించిరి. శ్రీ వేణుగోపాలరావు గ్రంథములో ఈ విషయాలు పేర్కొనబడినవి.

1924 క్రిమినల్ జాతుల చట్టం వలన ఈ జాతులవారు చాల కష్టాలకు గురియైనారు. అధికారులు ఈ చట్టాన్ని పురస్కరించుకొని వీరిని చాల హింసలు పెట్టినారు. 1948 సం॥లో మద్రాసు ప్రభుత్వము, యూనియన్ గవర్నమెంటు 1951 సం॥లో ఈ చట్టమును రద్దుచేసిరి.

చెంబల్ లోయలో గల సుప్రసిద్ధ దొంగల ముఠాకు చెందిన వీరుడనదగు మాన్‌సింగ్, పుత్లీ అను స్త్రీనాయకురాలు మున్నగువారు రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ మధ్యప్రదేశ్‌లలో గగ్గోలు పుట్టించారు. మహబూబ్‌ఖాన్, డూంగర్‌సాహీ. బాతోకి, షామా, భావావాలా మున్నగు ముఠానాయకులు గత శతాబ్దం చివరలోను ఈ శతాబ్దం ప్రారంభంలోను చాల ప్రసిద్ధి చెందియున్నారు. వీరిని మార్చుటకై సుప్రసిద్ధ సర్వోదయ నాయకులు వినోబాజీ, జయప్రకాశ్‌నారాయణ్ ప్రభృతులు చాల కృషి చేసియున్నారు, చేయుచున్నారు.

లోధాలు:-

పశ్చిమ బెంగాల్‌లోగల సంచార జాతి ఇది. నేర స్వభావం గల జాతి. 1961 లో మిడ్నపూర్ జిల్లాలోనే వీరి జనాభా 10,000 వరకు కలదు. వీరిని రెండు భాగాల క్రింద విభజింపవచ్చును. అరణ్యాలలో ఉండేవారు, అరణ్యేతర ప్రాంతాలలో ఉండేవారు. వీరిని బాగుచేయుటకు గట్టి ప్రయత్నములు చేయబడలేదు. 1951 తో క్రిమినల్ ట్రైబ్స్ చట్టం రద్దు చేయడంతో వీరు స్వేచ్ఛ పొందిరి. కొంతమంది వ్యవసాయ కూలీలుగా పనిచేస్తున్నారు. వీరు దొంగతనం చేయుటకు కొందరు గ్రామస్థుల మద్దతు ఉన్నదనిచెప్పుదురు, వారు ఈ ముఠాలకు పెట్టుబడిపెట్టడం, దొంగతనంచేసి తీసికొనివచ్చిన సొమ్మును దాచటం మున్నగునవి చేస్తారట. వీరికి కొన్ని క్రిమినల్ సెటిల్‌మెంట్లు ఏర్పాట్లు చేయబడినవి. అవి అంతగా వీరిని సంస్కరించ లేకపోయినవి.

మన మింతవరకు మనదేశంలోని సంచారజాతుల గురించి మాత్రమే తెలిసి కొన్నాము. ఇక ప్రపంచంలోని ఇతరదేశాలలోగల సంచారజాతులను గురించి క్లుప్తంగానైన తెలిసికొనవలసియున్నది. లేనిచో సంచారజాతుల సమగ్ర స్వరూప స్వభావాలు బోధపడవు.

## జిప్సీలు:-

శ్రీ భిక్షుచమన్‌లాల్ జిప్సీల గురించి ఒక గ్రంథం వ్రాసి ప్రకటించి యున్నారు. ఆయన ప్రపంచమంతా తిరిగి జిప్సీల గురించిన సమాచారం సేకరించి గ్రంథస్థం చేసినారు. జిప్సీలు దాదాపు యూరప్‌లోని అన్నిదేశాలలోను ఉన్నారు.

జిప్సీలు హిందూ సంతతికి చెందిన ఒక చిన్న జాతి యని మానుష శాస్త్ర వేత్తల అభిప్రాయం. భారతదేశాన్ని జిప్సీలు తమ మాతృస్థానంగా ఎంచుకొంటారు. ఒక దశలో భారతదేశముపై ఇతరులు దండెత్తినపుడు జిప్సీలు వలస వెళ్లి యుండవచ్చునని చరిత్రకారులు తలచియున్నారు. హంగేరీలోని జిప్సీల అనేక సాంఘిక పద్ధతులు, పంచాయతీలు, వేలాది జిప్సీ మాటలు మనదేశానికి సంబంధించినవే. వీరు యుగోస్లావియా, బల్గేరియా, హంగేరియా, చెకస్లొవేకియా ఫ్రాన్సు, ఇంగ్లండు, స్పెయిన్, జర్మనీ, స్వీడన్, రష్యా, అమెరికాలలో ఉన్నారు. వీరు పంజాబులోని ఆర్యన్‌సంతతికి చెందినవారని బాహాటంగా వారేచెప్పుకుంటారు, వారి భాష 'రోమని' సంస్కృతానికి చేరువలో ఉంటుంది, శ్రీ చమన్ లాల్ 3,000 రోమన్ మాటలను సేకరించి యుండెను. అవి యన్నీ సంస్కృతం, హిందీ, పంజాబీ, గుజరాతీ భాషలలోని మాటలని నిరూపింపబడినవి. వివాహపు పద్ధతులలోను, తదితర ఆచార వ్యవహారములలోను హిందువులకు, జిప్సీలకు సామ్యం ఉన్నట్లు తెలియుచున్నది.

మన దేశంనుండి వీరెప్పుడు ఇతర దేశాలకు వెళ్లారో చరిత్రకారులు ఇదమిద్ధంగా చెప్పలేకున్నారు. 326 బి. సి. లో అలెగ్జాండరు దండయాత్ర చేసినప్పుడని కొందరు, 11 వ శతాబ్దంలో మహమ్మద్ ఘజ్నీ దండయాత్ర చేసినప్పుడని కొందరు తెలుపుచున్నారు. వీరు వారంలోని రోజులను "ప్రథమ దివస" "ద్వితీయ దివస" ఈవిధంగా చెప్పుకొంటారు. ప్రపంచంలో చాల హింసకు గురి



మందుల వారి మహిళ

మైనవారిలో జిప్సీలు ప్రథములనియు, హిట్లర్ చేతనే 500,000 మంది చంపబడినారనియు, ఇతరులచే ఉరి తీయబడినవారు చాలమంది కలరని శ్రీ చమన్‌లాల్ వ్రాసియున్నారు. ఇన్ని ఆపదలకు గురియైనను వీరి జాతి నిలిచేఉన్నది. యూరోపులోను, అమెరికాలోను వీరిలో లక్షలమంది సంగీతవిద్వాంసులున్నారు. చాలమంది రచయితలుగను, కవులుగను, లాయర్లుగను, డాక్టర్లుగను, వ్యాపారస్తులుగను ప్రసిద్ధిచెందియున్నారు. ఒల్గేరియాలోనే 25 మంది మునిసిపల్ కౌన్సిలరులుగ ఎన్నుకొనబడి వ్యవహరించిరనియు 12 మంది పార్లమెంటు మెంబర్లుగ ఉండిరనియు వ్రాయబడినది. వీరిలో కొన్ని చెప్పుకోతగిన పద్ధతులుగలవనియు, ఒక జిప్సీ ఇంకొక జిప్సీతో అబద్ధ మెన్నడును చెప్పడు. తోటి జిప్సీ ఋణమును తప్పక తీర్చుకొనును.

యూరోప్‌లో వీరెప్పుడు ప్రవేశించిరో సరిగా తెలియదు. 1322 సంవత్సరంలో వీరినిగురించి క్రీట్‌లో మొదటగా వ్రాయబడినది. 1346లో కార్ఫ్యూలోను 1417లో మాలదీవులు, హంగేరి, జర్మన్, స్విట్జర్లండులోను ప్రవేశించినట్లు ఆయాదేశపు చరిత్రలలో కలదు. 1427 పారిస్‌లో ఎలుకచెప్పు వారుగను, వాయిద్యాలు వాయించేవారుగను ప్రవేశించిరని తెలియుచున్నది. సుమారు 1490లో జిప్సీలు ఇంగ్లండులో ప్రవేశించిరి. కొందరు రాజులు వీరిని చాల హింసపెట్టిరి. కొద్దిమంది వీరికి రక్షణ యొసంగిరి. 19వ శతాబ్దపు ప్రారంభంలో వీరుఉత్తరఅమెరికాలో చొచ్చుక వచ్చిరని తెలుపబడినది.

ప్రపంచంలో నివసిస్తున్న లక్షలాది జిప్సీలలో దాదాపు సగంమంది స్థిరమైన జీవితమునకు అలవాటుపడిరి. మిగతావారు ఒకచోటనుండి ఇంకొకచోటికి తిరుగుతునేయుండి సంచారజాతిగనే పరిగణింపబడుతున్నారు. కొంతమంది క్రైస్తవుల క్రింద మారినారు. క్రైస్తవమతము స్వీకరించినవారందరు సంవత్సరానికొకసారి దక్షిణఫ్రాన్సులో మే నెల 24 నుండి 26 వరకు జరుగు ఉత్సవములో కలిసికొనెదరు. 1930లో జిప్సీలు ఒక పత్రికను నడిపిరి.

మొదట్లో వీరు పడిన బాధలు చెప్పనలవికానివి. రీసెస్‌రాజ్యాధినేత 1711లో కనపడిన జిప్సీని కాల్చివేయమని ఉత్తరువులిచ్చియుండెను. కొన్నివేలమంది ఓడలలో బలవంతంగా ఎక్కించి ఆఫ్రికాకు బానిసలుగా పంపబడిరి. 1500లో

ఆర్లియన్ పార్లమెంటు వీరిని కాల్చిగాని, నరికిగాని చంపివేయవచ్చునని తీర్మానము చేసియుండెను.

కొన్నిదేశాలలో బలవంతంగా వీరి పిల్లలను ఎత్తుకొనివెళ్లి క్రైస్తవులు క్రింద మార్చిన సంఘటనలు ఎన్నో ఉన్నవి. వీరికి స్థిరనివాసము కల్పించుటకు వివిధ ప్రభుత్వాలు చేసిన ప్రయత్నాలు ఎక్కువ ఫలప్రదం కాలేదు. శ్రీ చమన్ లాల్ అంచనాప్రకారం ప్రపంచంలో ఉన్న జిప్సీల జనాభా 16 లక్షలకంటె మించి ఉండదు. ప్రజాస్వామ్యదేశమగు ఇంగ్లండులో కూడ 16వ శతాబ్ది ప్రారంభంలో జిప్సీ వ్యతిరేకచట్టము గావింపబడినది. జిప్సీలు ఇంగ్లండులో ప్రవేశించుట నిషేధింపబడినది. 1537లో థామస్‌క్రామ్‌వెల్ జిప్సీలను బహిష్కరించవలెను లేక వధించవలెనని ఉత్తరువులిచ్చెను.

జిప్సీలకు స్థిరనివాసము ఏర్పరచుటకై విశేష కృషిసలిపిన దేశములలో హంగేరి ఒకటి. జిప్సీలు తిరుగుట ప్రభుత్వంచే నిషేధింపబడినది. ఐనను కొందరు రహస్యంగా తిరుగుతువే ఉండేవారు. ఎట్లో సరిహద్దులను తప్పించుకొని ఇతర దేశాలలో ప్రవేశించి తిరుగుతునే ఉండేవారు. దాదాపు అందరు నిరక్షరాస్యులే. పాఠశాలకు పోయి ఎరుగరు. స్థిరనివాస మేర్పరచుకొనిన వారిలో కూడ వారి పాత ఆచారాలు మారలేదు. కొందరు దొంగలుగను, జేబుదొంగలుగను, పశువులను అమ్మేవారిగను, జంతువులను కాల్చేవారిగను వారి వారి వృత్తులనుబట్టి పిలువబడుచునేయున్నారు. వీరికి సంగీతంలో మంచి ప్రావీణ్యత కలదు. నలుగురైదుగురు కలిసి ఒక జట్టుగాఉండి ఒక్కొక్కరొక్క వాయిద్యమును వాయించుచు ప్రజలను సంతోషపెట్టెదరు. ప్రజలను ఆకర్షించుటకు జిప్సీబ్యాండువారు లేని పెద్ద పెద్ద హోటళ్లు ఉండవు. వీరిలో స్వాతంత్ర్యయోధులు గలరు. మారియాలాగ్గస్ అనునతనికి జిప్సీలకు సమానహక్కులు కోరినందుకు కారాగారశిక్ష విధింపబడెను.

బల్గేరియాలో జిప్సీలు తిరుగుబోతుతనం మాని స్థిరనివాస మేర్పరచుకొని వ్యాపారస్తులగను, పరిశ్రమల అధిపతులుగను కొందరు రాణించుచున్నారు. రష్యాలో వీరు 'నల్లసోదరులుగ' పిలువబడేవారు. రష్యన్‌లు కొందరు జిప్సీ స్త్రీలను పెండ్లి చేసికొనినట్లు చరిత్రలో వ్రాయబడినది.

రష్యాలో జిప్సీలు బ్రహ్మ, ఇంద్ర. విష్ణు, పార్వతి కథలను చెప్పుకొను చుండెదరని రష్యన్ చరిత్రపరిశోధకులకు యమ్. జె. కౌన్‌ప్రైన్ వ్రాసియుండెను. పార్వతిని మాతగా పిలుచుకొనెదరు. బ్రహ్మకు బరమీ అని ఇంద్రకు జంద్ర అని లక్ష్మికి లకి అని ఉచ్చరించెదరు. వేదమంత్రాలను వీరు యాసగా చదివెడువార నియు, ఉదాహరణకు 'ఓమ్' అను పదమును 'ఓమ్ని' అని ఉచ్చరించెడివారని ఆ చరిత్రపరిశోధకుడే తెలిపియుండెను.

బ్రిటన్‌లో ఇప్పటికి 30 వేలమంది జిప్సీలు కలరు. వీరి దేశమునకు 15వ శతాబ్దంలో వచ్చినట్లు చెప్పబడుచున్నది. వర్షాకాలంలో తిరుగక ఒకచోట ఉండెదరు. అప్పుడు వారి పిల్లలను బడులకు పంపించెదరు. వీరు కుర్చీలను, బండ్లను మరమ్మతుచేయుచూ, రంగులు వేయుచూ, చిన్న చిన్న సూదులను తయారుచేయుచూ జీవించుచున్నారు. జిప్సీ స్త్రీలు ఎట్టి అవినీతికి పాల్పడరనియు అవినీతిగ సంచరించకుండ పెద్దలు తగు కట్టుదిట్టములు గావించెదరని తెలియు చున్నది. నీతితప్పిన జిప్సీ స్త్రీకి ముక్కు, చెవులను కత్తిరించుట. మున్నగు కఠిన శిక్షలను వారి పెద్దలు విధించెదరు.

వీరు ఇంగ్లండునుండి 17, 18 శతాబ్దాలలో అమెరికాలో ప్రవేశించియుండిరి. అమెరికాలో కారును నడుపు ఆధునికమైన వసతులుగల కారవాన్‌లును నడుపు జిప్సీలను మనం చూడవచ్చు. స్వీడన్, యునైటెడ్‌స్టేట్సులో జిప్సీలు చాల అభివృద్ధిలో ఉన్నారు. గుర్రాలమీద స్వారిచేస్తూ తిరిగెదరు. జ్యోతిషం చెప్పెదరు. జిప్సీనాయకులను వారు రాజులని పిలిచెదరు. తగాదా, ఆస్తిపంపకము, విడాకులు, మున్నగు చిన్న చిన్న తగాదాలను తీర్చుటకు వారిలో వారికే 'జిప్సీ ట్రిబ్యునల్స్' కలవు. యునైటెడ్‌స్టేట్సులో వీరి జనాభా 100,000నుండి 200,000 వరకు ఉండ గలరని అంచనావేయబడినది. వీరిలో చాలమంది శిల్పపు పనులు చేయుటలోను, సంగీతపాటకులుగను, టీ అమ్మువారుగను, వ్యాపారస్తులుగను వ్యవహరించి జీవించుచున్నారు. ఎక్కువమంది మధ్య, దక్షిణఅమెరికాలోను ఉన్నారు. కొందరు కెనడా వెళ్ళియున్నారు. ఫ్లోరిడాలో వీరికి ప్రవేశమేలేదు.

## ఎస్కిమోలు:-

సంచారజాతులలో కొందరు ప్రపంచంలో తిరుగని స్థలం లేదు. కనిపెట్టని స్థలం అంతకంటె లేదు. వేటలో ప్రసిద్ధిచెందిన నియోలితిక్ మనుష్యులు అత్యంత సాహసంతో వేటకై క్రొత్త క్రొత్త స్థలములు వెతుకచూ ఉత్తరధృవం చేరిరి. వీరినే ఎస్కిమోలు అని పిలిచెదరు విరామంచుతో నివసించుటకు అలవాటుపడిరి. ఉత్తరధృవంలో నివసించుట సామాన్యమైన పనికాదు. సూర్యరశ్మి ఎప్పుడోకాని కనపడని ఈ స్థలంలో నివసించుటకు ఎంతటి ధైర్యము, స్థైర్యము, ఓపిక కావలెనో మనమూహించుట కష్టము. అట్టి ప్రదేశంలో ఉండుటకు అనువగు వస్తువులు వీరు నిర్మించుకొనిరి. మృగచర్మంతో గుడారాలు నిర్మించుకొనుటయే గాక, ఆ చర్మంతోనే స్త్రీలు గుడ్డలు కుట్టుకొని కట్టుకొనెదరు. పురుషులకు చలికి తట్టుకొనగల సూట్లు కుట్టెదరు. మంచుగడ్డలతో ఇండ్లు కట్టుకొనెదరు. అందు నివసించెదరు. సోప్‌రాతితో లాంతరులను చేసికొనెదరు. చెకుముకివంటి దానితో నిప్పు రాజేసికొందురు. బ్లబ్బర్ కట్టెను వంటచెరుకుగా ఉపయోగించుకొనెదరు.

వీళ్ల జనాభా వందలసంఖ్యలో ఉండును. కొన్నికుటుంబములు కలిసి ఒకే ఇంటిలో ఉండెదరు. ఐవను మోసము. తప్పుడుపనులు చేయుట జరుగవు. స్త్రీలు తమ పాతివ్రత్యమునకు ఎట్టి భంగము రానీయరు. మంచుతోనిండిన కొన్ని లక్షల కొలది మైళ్ళలో వీరు సంచరించెదరు. వీరికి దొరికేవి వివిధ రకాలైన పెద్ద పెద్ద చేపలు, చిన్న చిన్న మృగాలేనైనా దొరికితే వాటిని తింటూ జీవిస్తుంటారు. వారు తప్ప ఇతరులెవరు నివసించలేని ఇట్టి ప్రదేశంలో వారికి ఆహారసమస్య ఎప్పటి కప్పుడు ఎదురగుచున్నను అందుకు అలవాటుపడినారు. నిరంతరం తిరిగే సంచార జాతి కనుక వృద్ధులు, పిల్లలు వీరికి బరువుగా నుందురు.

వేటయే అది చేపలు కానీయండి మరొకటి కానీయండి వీరి ప్రధానవృత్తి. అందరూ వేటవలననే జీవించలెను. ఇందుకు వారిలోవారికిపోటీఉండవలసియున్నది. అది వీరిలో కనపడదు. వేటాడినది అందరు పంచుకొనెదరు. వీరికి నా అనునది ఏమీలేదు కనుక అందరూ కలిసి సమిష్టిగా జీవించుట వీరికి బాగా తెలిసిన విద్య. అవసరములేని వస్తువులను పాతిపెట్టెదరు.

## రెడ్ఇండియన్లు:-

వీరిని అమెరికన్ ఇండియనులనికూడ పిలిచెదరు. వీరి జనసంఖ్య 8,20,000కు మించి ఉండదు. ప్లేన్స్‌లోగల వేటాడువారు తూర్పు అడవులలో గల కట్టెలను కొట్టువారుగను, అరిజోనాగల నవోజ్ పశువుల కాపరులు, న్యూ మెక్సికోలోని ప్యూబ్లోరైతులు ఇందు కలరు. యూరోపియన్‌దేశీయులు అమెరికాను ఆక్రమించినపుడు కాల్చబడినవారూ పోగా పదిలక్షలమంది ఉండెదరని అప్పట్లో అంచనా వేసినారు. తరువాత అమెరికాను పరిపాలించిన వారు రెడ్ఇండియన్ల ఎడల, వారి సమస్యలఎడల సానుభూతిని చూపుటచే వారి జనాభా పెరుగుటకు అవకాశము కలిగినది.

సంవత్సరాలతరబడి వీరు పశువులను పెంచుటయే ప్రధాన జీవనాధారంగా చేసికొనియుండిరి. చుట్టుపట్ల విపరీతంగా నవీననాగరికతా ప్రభావం ప్రబలియున్నను, వీరిలో మార్పురాలేదు. వాళ్ల నమ్మకాలు వారికే ఉన్నవి. తరువాత తరువాత వీరిలో కొంత మార్పురాక తప్పలేదు.

వీరు గుఱ్ఱాన్ని ఉపయోగించుకోవడం 1600లోనే జరిగినది. వీరిలోని నవోజీ అను తెగవారు అరిజోనా, న్యూమెక్సికోలో నివసించే ఆదిమవాసులకు చెందినవారు. వీరు నిరంతరము తిరగటానికే అలవాటుపడినారు. ధాన్యాన్ని దొంగతనం చేయడానికి వీరు అలవాటుపడినారు. వీరు స్వతంత్రులుగా ఉండుటకే ఇష్టపడుదురు. పశువులతో ఒకచోటనుండి మరియొకచోటుకు పోవుచుందురు. తరువాత వీరిలో కష్టపడే స్వభావం అలవాటయినది. ఎక్కడ పశువులకు ఆహారము లభించునో అక్కడ ఉండడం సాగించారు. పశువులవలన వచ్చిన ఊలుతో కంబళ్లను నేయడం ప్రారంభించారు. కంబళ్లను అమ్మడం లేక ఇంకొక వస్తువుకు మారకం వేసి సంపాదించుకొనుటకు అలవాటుపడినారు. మగ్గాలమీద కంబళ్లు నేయడంలో వీరి స్త్రీలు చాల నేర్పరులు. వెండితో ఆభరణాలు అందంగా చేయడంకూడ వీరు తరువాత నేర్చుకొన్నారు. ఐనను, నవోజీలు ఇంకను సంచారజాతిగనే ఉన్నారు. యునైటెడ్‌స్టేట్సులో నవోజీలు ఇప్పుడు ఎక్కువసంఖ్యలో ఉన్నారు. గుఱ్ఱపుస్వారీ నేర్చుకొనిన తరువాతకూడ వీరు సంచారప్రవృత్తిని వదలలేదు కాని వారి జీవనవిధానంలో కొంత మార్పు వచ్చింది.

రెడ్ ఇండియన్లలో కొందరు యుద్ధవీరులుగ ప్రసిద్ధిగాంచిరి. వారి ధైర్య స్థైర్యములు ప్రశంసనీయములైనవి. వీరి పరాక్రమము గణనీయమైనది. ఈ సంచారజాతివారు ఆసియానుండి ముఖ్యంగా ఇండియాలోనుండి వలసవచ్చినట్లు వారి పేరే చెప్పకుండా చెప్పుటయేగాక వారి ఆచార వ్యవహారాలు, సంస్కృతి దీనిని ధృవపరుస్తున్నది. కాని పెక్కు శతాబ్దాలక్రితం వారెట్లు ఇంతదూరం రాగలిగిరి అనే సందేహం అందరికి కలుగకపోవుటలేదు. అప్పట్లో వీటిని కలుపుతూ అట్లాంటిస్ అనే భూభాగం ఉండేదని అది తరువాత సముద్రమునుం అయినదని కొందరు భూగోళశాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. కాలగర్భంలో ఏమిజరిగినదో ఎవరికి తెలియును ! ఏది ఎటులజరిగినా అమెరికన్ ఇండియన్లకు ఇండియన్ ఇండియన్లకు అహారపు అలవాట్లలోనేమి, నివసించుటలోనేమి, వేషధారణలోనేమి, అందాకఎందుకు దైనందిన జీవితవిధానములోనే ఎన్నో పోలికలున్నవి. రెడ్ ఇండియన్ భాషలో సంస్కృతపదము లెక్కువ ఉండుటకూడ ఈ సిద్ధాంతమును బలపరుస్తున్నది. ఉదాహరణకు వారు కుక్కను "షునకము" అందురు. కుక్కను సంస్కృతంలో 'శునకము' అని పిలిచెదరుగదా !

అర్జెంటైనాలో వీరి జనసంఖ్య 200,000 లకు పైనే కలదు. చెరకుపంట పండించుటలో వీరు సాయపడుచుందురు. రెడ్ ఇండియన్ల మొత్తము జనసంఖ్య 1940లో 30 లక్షల వరకుందని వ్రాయబడినది.

## పిగ్మీలు:-

వీరు మలేసియాలో నివసించుచున్నారు. ఫీకూపర్ కోల్ అను సుప్రసిద్ధ చరిత్రవేత్త వీరినిగురించి "ది పీపుల్స్ ఆఫ్ మలేసియా"లో వ్రాసియున్నారు. ఏక పత్నీవ్రతము వీరు నియమంగా పాటిస్తారు. కాని విడాకులు ఇచ్చుచునేయుందురు. విడాకులిచ్చినపుడు చిన్నపిల్లలు తల్లిదండ్రుల వద్దనే ఉండెదరు. వీరికి ఆస్తి ఏమీలేదు. కాని అండమాన్సులోను, మలేపెనిన్సులలోను వీరు చెట్లను ఆస్తిగా ఎంచుకొనెదరు. వీరు కోటీవారలకు సహాయపడుచునే ఉందురు. వీరు వేటాడు సంచారజాతికి చెందినవారు.

## సీ జిప్సీలు:-

వీరెల్లప్పుడు పడవలమీద సంచారం చేస్తారు. సముద్రాలమీద సంచరిస్తారు. కనుకనే వీరిని సముద్రపు సంచారజాతులు అని పిలుస్తున్నారు. దక్షిణ బర్మా కోస్తాలోను వీరెక్కువగా నివసిస్తున్నారు. చైనాలో కాంటన్ తీర రాష్ట్రంలో అనేక మంది చైనీయులు పడవలలోనే నివసిస్తున్నారు. వారికున్న కొద్ది స్థలం ఏదైనా ఉన్న పండించుకోటానికి ఉపయోగించుకుంటారు. ఇండోనేషియాలోగల ఆదిమ వాసులలో సముద్రపు సంచారజాతులున్నారు.

## పోలినేసియన్లు:-

వీరూ పెద్ద పడవలను నిర్మించుకొని అందు ఒక ప్రదేశమునుండి ఇంకొక ప్రదేశానికి సముద్రంమీద తిరుగుతుంటారు. వారికి ప్రత్యేకంగా పోలినిసియను దీవులు ఇప్పుడు కలవు. ఈ పడవలలో ఒకచోటనుండి ఇంకొకచోటికి మనుష్యులను, సరుకులను రవాణా చేస్తారు. పెద్ద పెద్ద దూలాలను, కొబ్బరికాయలను, పందులను, కోండ్లను, కుక్కలను రవాణాచేస్తారు. వీరు క్రొత్త క్రొత్త ద్వీపాలను కనిపెట్టి అందు చెట్లను నాటి పెంచెదరు. వీరు ఇండోనేసియా నుండి వచ్చి ఉంటారని కొందరి చరిత్రకారుల అభిప్రాయము. మరికొందరు, చైనా తూర్పు కోస్తానుండి వచ్చియుందురని వ్రాసియున్నారు. వీరు ఇరవై ముప్పైమంది కలిసి ఒకచోట నివసించెదరు. తోటలను పెంచెదరు. మంచిపండ్లు, దుంపలు తినెదరు. వీరు ఐచ్ఛికంగా కుటుంబనియంత్రణ అవలంబించుట వలన జనాభా పెరగకుండ చూచుచున్నారు. ఇంద్రియనిగ్రహం, గర్భస్రావము, మానవబలి మున్నగు నియంత్రణామార్గములను వీరు ఆచరించుచున్నారు.

## జ్యూస్:-

వీరినిగురించి తెలియనివారు లేరు. యూరోప్‌లో క్రైస్తవుల చేతులలో వీరు పడిన బాధలు చెప్పనలవికాదు. వారి తప్పేమి లేకున్నను, వీరిని ద్వేషించుట, దోపిడీచేయుట, శిక్షించుట జరిగినది. ఇంతకూ వీరు ధనికులగుటవలన ఎక్కువ

బాధలకు గురికావలసియున్నది. ఇది చాల తెలివిగలజాతి. డబ్బును వడ్డీకిచ్చి దయాదాక్షిణ్యం లేకుండా డబ్బు గుంజుట వీరికి బాగా తెలియును. వీరు డబ్బు ఖర్చు చెయ్యరు. పిసినికొట్టువారు. "ది మర్చంట్ ఆప్ వెనిస్" కథ అందరికి తెలిసినదే. వారు పెద్దధనవంతులు, కాని పలుకుబడి శూన్యం, వీరు ఎల్లపుడు ఇతరులచే ద్వేషింపబడుటచే ఒక్కచోట ఉండక ప్రదేశాలు మారుస్తుండడం వీరికి వరిపాటియైనది. అందువలన వీరిని మానుషశాస్త్రవేత్తలు ఒకవిధమైన సంచార జాతిక్రిందకు చేర్చినారు. కాని నిజంలో సంచారజాతిక్రిందికి పూర్తిగా రారు. జర్మనీలో లక్షలకొలది జ్యూస్‌లను చంపినందుకు అనేకమంది శిక్షకు గురిఅగుట చరిత్ర ప్రసిద్ధమేకదా!

## ఆరుంటులు:-

వీరు సెంట్రల్ ఆస్ట్రేలియాలో నివసించు ఆహారము సమకూర్చుకొనుటకు తిరిగే సంచారజాతి. నిరంతరము తిరుగుతునే ఉండెదరు. సరియైన వస్త్రధారణ ఉండదు. ఏది దొరికితే అది తినెదరు. ఉంటే తినడం లేకుంటే పస్తుండటం వీరికి అలవాటు. వీరు తమాషాలు చేసి ప్రజలను ఆనందపరచెదరు. వీరుగాక ఆస్ట్రేలియాలో ఇతర సంచారప్రవృత్తిగల ఆదిమవాసులనేకులున్నారు. వీరు పండ్లను, చేపలను, నిల్వచేసికొని తినెదరు. మనదేశంలోగల పాముల, ఎరుకల మున్నగువారిని వీరెక్కువ పోలియుందురు. ఆస్ట్రేలియాలో వీరిని బాగుచేయుటకు అనేక మార్గాలు అవలంబిస్తున్నారు. పిల్లలను తల్లిదండ్రులనుండి వేరుచేసి బడులలో చేర్చుటకు అనువగు చట్టాలు చేసియున్నారు. ప్రభుత్వంలో వీరిని బాగుచేయుటకు డైరెక్టరేట్ కలదు. ఆ డైరెక్టరేట్‌కు వీరిపై అనేక అధికారాలు ఇచ్చియున్నారు. ఆస్ట్రేలియాలో నివసిస్తున్న ఆదిమవాసులలో నూటికి యాభైమంది సంచారజాతుల వారేయని ప్రభుత్వం ప్రకటించియున్నది.

## రానీలు:-

వీరిపుడు అన్నిదేశాలలోను ఉన్నారు. మనదేశంలోకూడ అన్నిప్రాంతా వీరు తిరుగుతుండడం మనం చూస్తున్నాము. వీరు ఇరాన్‌దేశానికి చెందిన వీరు తిరుగుతూ అద్దాలు, సుగంధద్రవ్యాలు, పూసలు అమ్మెదరు. దేశంలో ఉంటే ఆదేశం భాషలను మాట్లాడగలరు. వీరికి రాజకీయాలు ). ఏ మతానికి చెందినవారుకారు. వారి నమ్మకాలు వారికే ఉన్నవి.

# 4. సంచారజాతులసంస్కృతీసాంప్రదాయాలు

కొండలలో, కోనలలో నివసించవచ్చును. 'ఈ రోజు ఇక్కడ రేపు ఎక్కడో' తిరుగుబోతులవలె తిరుగుతుండవచ్చును. వేష భాషలలో అనాగరికుల వలె కన్పడవచ్చును. కాని ప్రతి జాతిలోను ఆయాజాతికి సంబంధించిన ప్రత్యేక సంస్కృతి వారిలో నిండి నిబిడీకృతమైయుండును. ఇది మనకు కనబడునదికాదు. వెంటనే తెలియునదియు కాదు. వీరిని తరచి తరచి చూచిననే ఇది బోధపడగలదు. ఈ జాతుల ఉద్ధరణకు తన జీవితసర్వస్వము అర్పించిన హైమండార్ఫ్ "వీరి జీవితవిధానములో నేటి సభ్యతాప్రపంచము నేర్చుకొనవలసిన విజ్ఞాన విశేషము లెన్నియో కలవు." అని ప్రపంచానికి చాటియున్నారు.

## పంచాయతీ పద్ధతి:-

దీనిని ఈ జాతులవారు చాల పటిష్ఠంగా నడుపుకొనుచున్నారు. ఐచ్ఛికంగా నిర్దేశించుకొనిన కొన్ని సూత్రముల ననుసరించి పంచాయతీ జరుపుకొనెదరు. తమలోగల తగవులను పంచాయతీ వలననే పరిష్కరించుకొనెదరు. ప్రపంచంలో గల అన్ని సంచారజాతులలోను ఎస్కిమోలు మొదలుకొని ఎరుకలవారివరకు పంచాయతీ పద్ధతి కలదు. ప్రతి పంచాయతీకి ఒక అధిపతి ఉండును. ఇతని అధ్యక్షతన ఈ పంచాయతీలు జరుగుచుండును. ఈ పంచాయతీలు కొన్ని గంటలలో ముగియవు. కొన్ని రోజులవరకు రాత్రింబవళ్లు జరుగుచునేయుండును. ఇది వీటి ప్రత్యేకతయని చెప్పినను చెప్పవచ్చును.

పంచాయతీ విధించు శిక్ష అమలుజరిగి తీరును. దీనిని వ్యతిరేకించుటకు ఎవరికి గుండెలు లేవు. ఎగత్రించిన సంఘ బహిష్కరణమే, కఠినశిక్షలకు గురి కావలసియుండును. ప్రాచీనకాలమునుండి మనదేశంలో ఒక గ్రామపంచాయతీ కలదని చరిత్ర ఋజువుచేయుచున్నది. ఈ ఆచారమే మనదేశంలోని సంచార జాతులకు వచ్చుటలో ఆశ్చర్యము లేదు కాని, ప్రపంచంలో అన్ని దేశాలలో నివసించు సంచారజాతులలో ఇట్టి పంచాయతీ పద్ధతి అమలులోనుండుట గమనార్హము.

మనదేశంనుండి అతి ప్రాచీనకాలంలో వలసవెళ్లినవారని చెప్పబడిన జిప్సీలలోను రెడ్ ఇండియన్లలోను ఇట్టి పంచాయతీ పద్ధతి అమలులోనుండుట ఆశ్చర్యంలేదు. ధృవప్రాంతంలో ఉన్న ఎస్కిమోలు ఈ పద్ధతి అవలంభిస్తున్నారు. పోలినీషియన్స్, జ్యూస్, ఆరుంటలు, ఆస్ట్రేలియా సంచారజాతులలో కూడ పంచాయతీ పద్ధతి కలదు. జిప్సీలలో "జిప్సీ ట్రిబ్యునల్స్" అనెదరు. అటులనే వివిధ నామములతో ఈ పద్ధతి కలదు.

వారిలో వారికిగల తగాదాలను తీర్చుకొనుటకు మాత్రమే ఈ పంచాయతీ పద్ధతి ఉపయోగపడుటలేదు. ఈ పద్ధతివలన వారిలో నిస్సహాయులకు ఆర్థికసహాయము కల్గించబడుచున్నది ఒకకుటుంబపెద్ద చనిపోయినచో అతనికొడుకు మైనరై నిస్సహాయుడగుచో అతను మైనరు తీరునంతవరకు ఈ పంచాయతీ రు. 10/- నుండి రు. 15/-ల వరకు పెన్షన్ ఇస్తుంది. దొంగతనం చేయునపుడు తలకాయకు బలమగు దెబ్బతగులుచో, రు. 200/-లు, ముక్కుపోతే రు. 60/- అవయవప్రాముఖ్యతనుబట్టి ఈ గ్రాంటు రు. 500/-ల వరకు ఉండును. చూడండి వారి పరస్పర సహాయము ఎంతవరకు పోయినదో !

ఈ పంచాయతీలలో ఒక నిర్దుష్టవిధానమును అవలంబించెదరు. పంచాయతీలకు ఒక నిధి ఉండును. తోటివారు కష్టసమయములోనున్నను, తీవ్రమైన జబ్బులకు గురియైనను, నిస్సహాయులైనను, అనాధలైనను ఈ నిధినుండి పంచాయతీ సహాయముచేయును. ఇట్లు పరస్పరసహాయం తద్వారా పరస్పర విశ్వాసము వీరిలో పూర్తిగా పాతుకొనిపోయిఉన్నది.

ఈ పంచాయతీ పెద్ద దాదాపు నియంత అనే చెప్పాలి. వారిలో ఎవరైన ఒక కేసులో అప్రూవర్ గామారిన అతనిని కనబడితే చంపివేయుటకు ఇతనుఉత్తరువులివ్వగలడు. తరతరములవరకు అతనిని సంఘమునుండి బహిష్కరించెదరు. ఇది సన్సీల్ జాతిలో ఇప్పటకి అమలులోనున్నది.

ఒకడు తప్పుచేసి ఒప్పుకొననిచో ఈ క్రిందివిధంగా పంచాయతీ పరీక్షించగలదు. 1) నిర్ణయించినంత కాలము నీటిలో నిలుచొని ఉండవలెను. 2) ఎర్రగా కాల్చిన గడ్డపారను చేతిలో పట్టుకొని నిర్ణయించిన దూరము నడచివెళ్లవలెను.

సంచారజాతులు తాము ఏఏ ధర్మములు మంచివని భావించిరో వాని ననుసరించుటకు వెనుదీయరు. ఎంతటి త్యాగమునైనను చేసెదరు. పంచాయతీని వారు "ధర్మదేవతగా" నమ్మిరి. ఇప్పటికిని పంచాయతీ తీర్పును అనుసరించుచునే యున్నారు.

## నీతి నిజాయితీలు:-

సంచారజాతులలో అప్పు ఎవరిదగ్గరనైనను తీసికొన్నచో ఎన్ని సంవత్సరములైనను పైసలతో తీర్చెదరు. ఎన్ని తరముల క్రింద అప్పైనను అప్పుడున్న వారు తీర్చవలసినదే. మారు మాటాడుటకు వీలులేదు. ఈ పద్ధతి ఎంతటి నిజాయితీని ఋజువుచేయుచున్నది? స్త్రీలేమి, పురుషులేమి, ఎక్కడో తప్ప నీతిగా వ్యవహరించెదరు. అబద్ధమాడరు.

## స్త్రీలకుగల ఉన్నతస్థానము:-

వీరు పురుషులతోపాటు కష్టపడెదరు. పురుషులు స్త్రీలను తక్కువగా చూడరు. అందువలననే వీరిలో స్త్రీలకుగల స్థానము చెప్పుకోతగినది. గృహయాజమాన్యమంతయు స్త్రీయే చూచుకొనును. భార్యాభర్తలు, ఎక్కడో తప్ప, అనురాగంగా జీవించెదరు. వీరిలో బాల్యవివాహాలు మొదటినుండియులేవు. వయసు వచ్చిన తరువాతనే పెండిండ్లు జరుగును. భర్త చనిపోయిన మరల వివాహము చేసికొనుటకు స్త్రీకి హక్కు కలదు వివాహములు పరస్పర ప్రేమవలన జరుగును. స్త్రీ పురుషులు బలిష్ఠులుగను ఆరోగ్యవంతులుగను ఉందురు. దేవతాపూజలలో భర్తతో భార్య పాల్గొనును. ఎక్కడనైన మకాం చేసినపుడు ఒక్కొక్క కుటుంబమునకు ఒక గుడారముండును. రాత్రిళ్లు ఒక గుడారమునుండి ఇంకొక గుడారమునకు పరాయివాడు వచ్చుచో అతనిని బల్లెముతో పొడిచి చంపుటకు వెనుదీయరు. ప్రయాణము చేయునపుడు స్త్రీలను ఎక్కువ సామానుని మోయనీయరు. పురుషులు స్త్రీలను గౌరవించెదరు. స్త్రీలు తమ పాతివ్రత్యమును ఎప్పుడు కాపాడుకొనెదరు. పురుషులతో స్వేచ్ఛగా తిరిగినను వారుండవలసిన స్థానములో వారుండెదరు. అందువలననే స్త్రీలన్న పురుషులకు అమిత గౌరవము, ఆదరణ ప్రేమ కలదు.

## అతిధులను గౌరవించుట:-

వీరిలో అతిథులను గౌరవించు పద్ధతి చాల కొనియాడతగినది. ఇది వీరిలోని ప్రత్యేకత. అతిథిని గౌరవించి ఆదరించుట వీరికి ఉగ్గుపాలతో పెట్టినవిద్య. పశువులను పెంచువారు ముందు అతిధులకు పాలను, మజ్జిగను ఇచ్చెదరు. వీరు అతిథులను ఉద్దేశించు ఒక పాటలోని అర్థమిది.

''నా ఇంట చినిగిపోయిన చాప తప్ప ఇంకొకటి లేదు. నా అతిథిని ఆ చాపపై కూర్చుండబెట్టి నేను క్రింద కూర్చుందును. నావద్ద రెండు మామిడిపండ్లు మాత్రమే కలవు. అందు ఒకటి పండినది. మరియొకటి పచ్చిది. పండినఫలము అతిథికిచ్చెదను. పచ్చిది నేను తిందును.''

## దైవచింతన:-

వీరు ఎంత అనాగరికులుగ కనపడినను, చదువనునది తెలియకున్నను, వీరిలో ఎక్కువమందికి దైవభక్తి కలదు. ప్రతి దేహంలోను జీవుడు, ఆత్మ అని రెండు కలవనిన్నీ జీవుడు దేహముతో పుట్టి దేహముతో నశించుననియు, ఆత్మ చావులేక ఎల్లప్పుడు ఉండునని వీరి నమ్మకము. దేహము నశించినతరువాత దానిలో ఉండిన కర్మ పరిపక్వమగు వరకును ప్రేతగా ఉండి కర్మ పరిపక్వమైనంతనే పితృలోకమునకు పోవుననియు, అపరమైనయెడల ఇంకొక జన్మ ఎత్తునని వీరి సిద్ధాంతము. చనిపోయినవారి ఆత్మలతో సంభాషించు శక్తి వీరికి కలదనియు, వారి ఆత్మలను సైతము తమ కాయములలో ప్రవేశింపచేసికొను శక్తి వీరికి కలదని చెప్పెదరు. సోదిచెప్పుటకు ముందు స్త్రీలు దేవతలను తలచుకొని చెప్పెదరు. పురుషులు మంత్రాలుకూడ చదివెదరు.

డొక్కలవారు తాళపత్రగ్రంథాలలోని శ్లోకాలను చదివి అర్థం చెప్పగలరు. వృక్షసంబంధమైన పరిజ్ఞానం వీరికి కొంత కలదని చెప్పెదరు. బుడబుక్కలవారు జ్యోతిషం చెప్పగలరు. ఇండ్లముందుకు వచ్చి మంత్రాలలాంటివి చదువుతూ ఆశీర్వదిస్తూ ఉంటారు. పెద్దింటిగొల్లలు మంత్రాలు చదివి తాంత్రికవిద్యను ప్రదర్శించెదరు. చివరకు దొంగతనమునకు వెళ్లేటప్పుడుకూడ దేవతను కొలిచి,

బలిఇచ్చి, శకునాలు చూచి బయలుదేరుతారు. బాలసంతు చక్కగా దేవునిమీద పాటలు పాడగలరు. పిచ్చిగుంట్లవారు శ్రావ్యంగా రామాయణ, భారత కథలు రమ్యంగా చెప్పగలరు. పూసలవారు కథలు చెప్పగలరు.

దైవభక్తి వీరికి కలదు. ఇంత తిరుగుచున్నను, ఆ భక్తియే వారిని సదా రక్షిస్తున్నదని భావించవచ్చును.

## వైద్యపరిజ్ఞానము:-

వీరిలో చాలమంది అరణ్యాలలో తిరుగుచుండెదరు గనుక ఓషధప్రక్రియ వీరికి బాగా తెలియును. మూలికలు వాటి ఉపయోగమును గురించి వంశపారం పర్య వారికి తెలిసిన విద్య. తేలుకాటుకు, పాముకాటుకు మందులు కలవని వారు బజార్లంబడి తిరిగి అరుస్తూ మూలికలు అమ్మట మనం చూస్తూనే ఉన్నాము. దాదాపు అందరు సంచారజాతులకు ఈ విద్య తెలియును. మంత్ర తంత్రములచే రోగములు కుదర్చగలమని చెప్పేవారు వీరిలో చాలమంది కలరు. వీరిలో మొండి బండ, పలుకుముగ్గులవారు ప్రసిద్ధులు. ఇది నమ్మకమను సిద్ధాంతముపై ఎక్కువ ఆధారపడియున్నది. వారి మతమే అదికూడ అని చెప్పవచ్చును.

## కుటీరపరిశ్రమలు:-

కేవలము దొంగతనము చేయువారగు నాలుగైదు సంచారజాతులను మినహాయించుచో. మిగతావారందరును పశువులను పెంచియే, చిన్న చిన్న కుటీరపరిశ్రమలను చేసికొనుచు జీవించువారే. ఎస్కిమో స్త్రీలు జంతుచర్మములతో చలికి తట్టు కొనగల దుస్తులు ఎంతో అందంగా కుట్టెదరు. గోడిలోహార్లు శిల్పపువనులు చేయగల బహు నేర్పరులు, వ్యవసాయపనిముట్లు చేసి జీవించువారు. పూర్వం రాజపుత్రుల యుద్ధాలకు కావలసిన ఆయుధాలు వీరే తయారుచేసేవారు. రకరకాలైన పూసలను తయారుచేసి అమ్మి జీవించేవారు వీరిలో ఉన్నారు. చెంచులు. ఎరుకలవాడు బుట్టలు, చాపలు అల్లుటలో నేర్పరులు. దువ్వెనలుచేసి అమ్మువారు వీరిలో కలరు. నవరాలుచేసి అమ్మగలరు. వీరుచేయు కుటీరపరిశ్రమలందు హస్త

కౌశలము వెల్లడియగుచున్నది. సామాన్యప్రజలకు ఉపయోగపడునట్లు వీరు చిన్న చిన్న వస్తువులు చేసి అమ్మి జీవించుచున్నారు.

## సంగీత నాట్యవాంలు:-

ఇందునను ప్రజ్ఞానవంతులు వీరిలో కలరు. దొమ్మరులు త్రాటిపైన నడచుచు నాట్యమాడగల సమర్థతగలవారు. యానాదులు, ఎరుకల స్త్రీలు బహు శ్రావ్యంగా పాడగలరు. 'యానాది భాగోతులు' ఇప్పటికి ఆంధ్రదేశంలో ప్రసిద్ధి చెందియున్నారు. పల్లెలలో వీరు 'భాగవతములు' ఆడి ప్రజలను మెప్పించి వారి దగ్గర బహుమతులు పొందెదరు. ఇటీవల నాటకాలు, సినిమాలు వచ్చినతరువాత వీరి భాగోతములను ప్రజలు ప్రోత్సహించుటలేదు. జిప్సీలు చక్కగా సంగీతము పాడగలరు. జిప్సీలు బ్యాండువాయించుట ప్రపంచ ప్రసిద్ధి చెందినది. పాశ్చాత్య దేశాలలో ముఖ్యంగా ఇంగ్లండు, అమెరికాలలో పెద్ద పెద్ద హోటళ్లలో వీరి బ్యాండ్లు ఉండితీరవలెను. లేనిచో ఆ హోటలు ప్రజలను ఆకర్షించదు. దొమ్మరులు సాము గరిడీ చేసి పాటలు పాడి ప్రజలను మెప్పించెదరు. పాములవారు నాగస్వరము చక్కగా పాడి పాములను ఆడించెదరు. బుడబుక్కలవారు డమరకం లాంటిది వాయించుచు అనేకపద్ధతిలో పాటలు పాడెదరు. బాలసంతువారు బొబ్బిలి కథలు శ్రావ్యంగా పాటలు పాడుతూ చెప్పెదరు. వీరే పలురకాలైన వేషాలు వేసి ప్రజలను సంతోషపరచెదరు. పిచ్చిగుంట్లవారు బూరలు ఊదుతు, అనేక విధమైన వాయిద్యంతో శ్రావ్యమైన శ్రుతితో కాటంరాజు కథలు వగైరా తెల్లవార్లూ చెప్పెదరు, కూర్చొన్నవారిని కదలనీయకుండా వినేటట్లు చేయగలరు. బైనోళ్లు చక్కగా కీర్తనలు పాడగలరు కథలు చెప్పగలరు. గ్రామ జాతర్లలో వీరున్ననేగాని ప్రజలలో ఉత్సాహం వెల్లివిరియదు. పూసలవారు 'చిన్నలక్ష్మమ్మ' 'దేశమ్మరాజు' మున్నగు కథలు చెప్పి ప్రజలను ఆకట్టుకొనగలరు. ఎరుకలస్త్రీలు ఎరుక బహు రమ్యంగా చెప్పగలరు. సంచారజాతులలో చాలమంది సంగీతమందును, నాటకములు వేయుటలోను, నాట్యము చేయుటలోను, కథలు చెప్పడంలో నేర్పరులు. కనుక వీరిలో విజ్ఞానము లేదనగలమా!

## నీతి కథలు:-

సంచారజాతులు విద్యావంతులు కాకున్నను, నీతులను బోధించు అనేక కథలు చెప్పుకొందురు. ఇవి వినుటకు చాల సొంపుగ నుండును. ఇవి యీసప్ ఫేబిల్స్ కథలవలె నుండును. చక్కని నీతులు గరపు ఈ కథలు ఎన్ని విన్నను తనివి తీరదు. ఉదాహరణకు దిగువ పేర్కొనబడిన ఈ కథలలో కొన్ని మనము సాధారణముగ చెప్పుకొనునవియే.

(1) ఎద్దు-కుక్క:- ఒక దినమున ఒక కుక్క గడ్డిమోపుపై పరుండి నిద్ర పోవుచుండెను. ఆకలిబాధపడు ఒక ఎద్దు ఆ గడ్డిని తినుటకై అచ్చటికి వచ్చెను. కుక్క మేల్కొని అరచుచు ఎద్దును తరుమసాగెను. ఎద్దు గడ్డిమోపు వద్దకు వెళ్లుటకు భయపడి తనలో ఇట్లనుకొనెను. ''ఈ కుక్క గడ్డిని తాను తినుటకు నోచుకొనలేదు. తినగల నన్ను తిననిచ్చుటలేదు. ఇట్టి ఓర్వలేనితనముచే చివరకు ప్రాణముకూడ కోల్పోవును.'' అని తలచి ఆ చోటు వదలి వెళ్ళెను. కుక్క గడ్డిమోపుకు కావలాకాయుచు కొన్ని దివారాత్రము లట్లు గడపి చివరకు ఆకలిచే కృశించి ప్రాణములు కోల్పోయెను. నీతి;-ఆకలిబాధ పడువానికి తన శక్తికొలది ఆహార మిడనిచో తనకెంత భాగ్యమున్నను వృధాయగును. ధనము ఖర్చుచేయక కూడబెట్టుటవలన ప్రయోజనములేదు. తాననుభవింపక, ఇతరుల ననుభవించుట కిచ్చగింపనివాని జీవితము వృధాయగును. ఇతరులకు శక్తికొలది సాయపడుము. ఈ కథ సంచారిజాతుల వేదాంతతత్వవిచార ఉత్కృష్టతను పరోపకార ప్రబోధ చింతనమును వెల్లడిచేయుచున్నది.

(2) పిల్లలు-కప్పలు:- ఈ కథ ప్రతిపిల్లవానికి తెలిసినదే. ఒక చెరువులో చాల కప్పలు గలవు. ఒక దినమున కొందరు తుంటరిపిల్లలు చెరువువద్దకు వచ్చి కప్పలపై రాళ్లు రువ్వనారంభించిరి. వాని శరీరమునుండి రక్తము కార నారంభించెను. ఆ దెబ్బలకు తాళలేక ఒక ముసలికప్ప పిల్లలతో 'నాయనలారా! ఇంత చిన్నతనముననే మీరింత దుర్మార్గముగా ప్రవర్తించుచున్నారు. మీరు ఆడు ఆట మమ్ములను చంపుచున్నది. మీరు చేయుచున్న పని పిల్లికి చెలగాటము, ఎలుకకు ప్రాణసంకటంలాగున్నది. మా బోటి సాధువులను హింసించుట మీకు న్యాయము కాదు' అని మొరపెట్టుకొనిరి. ఇంతలో కొందరు బుద్ధిమంతులు అచటికి రాగా

పిల్లలు సిగ్గుదెచ్చుకొని పారిపోయిరి. నీతి:-ఇతరులకు (ప్రాణికోటికి) హాని చేయుచు తాను సంతసించువాడు క్రూరుడు."

"(3) పులి-గేదెలు;- ఒకనాడొక పులి అడవిలో మేయుచున్న గేదెలలో ఒకదానిని చంపబోయెను. కాని గేదెలన్నియు కలిసి పులిని తరిమివేసెను. అంతట ఆ పులి మోసముచేసియైనను గేదెలపై పగసాధింప తలచి "నేను ఈ రోజున ఒక బలసిన గొర్రెను చంపితిని. మీలో ఎవరైనా ఒకరు వచ్చి నాతో ఈ రాత్రి విందారగించవలసినది."అని వినమ్రతతో ఆహ్వానించెను. ఒక గేదె సాహసించి పులితో విందారగించుటకు వెళ్లెను. విందారగించు చోట కట్టెలు, పెద్దకుండలు కనిపించెను. వానిని చూచి గేదె చాల భయపడి పరుగెత్తుచుండెను. పరుగెత్తుచున్న గేదెతో 'ఏమి, అట్లు భయపడుచుంటివి' అని పులి ప్రశ్నించెను. అందుకు గేదె 'నీ మాయోపాయము అర్థమైనది. విందు చేయుచోటుగల కుండలు, గొర్రెలను వండుటకు పనికి వచ్చునవికావు. నావంటి పెద్దజంతువులను వండుటకు తయారు చేసితివి;" అని జవాబు చెప్పుచూ పరుగెత్తి ప్రాణాలను రక్షించుకొనెను. నీతి:- మోసము కల కాలము సాగదు."

పార్వతీ పరమేశ్వరుల కథలు ;-

(1) కొందరు పిల్లలు ఒక పెద్ద చెరువులో ఈదుచుండిరి. ఒక గ్రుడ్డి బాలుడుకూడ స్నానముచేయుచు కనబడక బురదనీళ్లను పైన పోసికొనుచుండెను. కొంతసేపటికి పరమేశ్వరుడు భార్యతో సహా అక్కడికి వచ్చెను. పార్వతి ఆ గ్రుడ్డిపిల్లవాని చూచి జాలిపడి పార్వతీదేవి భర్తతో 'ఈ పిల్లవానిని గ్రుడ్డివానిగ చేసి మీరు ఎంతో పాపమునకు ఒడిగట్టియున్నారు' అనెను. 'ఈ పిల్లగాడు కడు దుర్మార్గుడు. కండ్లు బాగున్న ఎంతమందినో హింసించ గలడు' అని పరమేశ్వరుడు చెప్పగ పార్వతి నమ్మక 'నా మనవి విని పిల్లవానికి కండ్లు ప్రసాదించండి. అతని దుర్మార్గమును పరిశీలింతమని భర్తను వేడెను. పరమేశ్వరుడు భార్యను సంతృప్తిపరచుటకై ఆ బాలునికి కండ్లు కనపడునట్లు చేసెను. బాలుడు కండ్లు రాగానే పిల్లలందరిని చావమోదసాగెను. పార్వతి నిశ్చేష్టురాలై, పరమేశ్వరుని సృష్టిలోగల రహస్యమును తెలిసికొని పిల్లవానిని మరల గ్రుడ్డివానిగ చేయవలసి

వదని భర్తను ప్రార్థించెను. పరమేశ్వరుడు భార్యతో 'ఇతనికి కండ్లు కనపడుటచే కలిగిన హింసవలన వచ్చు పాపము నీ వనుభవింపవలసినదేయని' చెప్పి ఆ మరల యథాప్రకారముగా గ్రుడ్డివానిని చేసెను."

(2) పార్వతీదేవి ఒకపరి ఒక చీమను తీసి తన డబ్బుల సంచిలో దాచి 'మీరు సృష్టించిన జీవరాసులన్నింటికి ఆహారమిచ్చుచుంటిరా' అని భర్తను ప్రశ్నించెను. పరమేశ్వరుడు 'అవునని' చెప్ప 'ఈ చీమకు ఆహార మెక్కడిది' అని తను దాచిన చీమను పరమేశ్వరునకు చూపించెను. ఆ చీమనోటిలో బియ్యపుగింజ చూచి పార్వతి ఆశ్చర్యపడెను. పార్వతీదేవి భర్తకు ప్రణామమిడి పరమేశ్వరుని న్యాయ పరిపాలనకు అబ్బురపడెను."

(3) ఒకనాడు పార్వతీదేవి భర్తను మనసారచూచి ఇట్లనుకొనుచుండెను. 'నా భర్త అందమైనవాడు. ఆయన సౌందర్యమునకు దీటైనవాడు ఈ ముల్లోకములయందును లేడు. నేను ఆయనను పతిగా బడయుటవలన చాల అదృష్టవంతురాలను' అని గర్వపడసాగెను. ఈ మాటలు పరమేశ్వరుడు విని విననట్లుగ నటించుచు లేచి నలుదిక్కులకు తిరుగుచు నమస్కరింపసాగెను. భార్య ఇదిచూచి ఆశ్చర్యపడి 'మీరు అందరికంటె గొప్పవారుకదా ! మీరు ఎవరికి నమస్కరించుచున్నారు' అని ప్రశ్నించెను. పరమేశ్వరుడు తన అర్ధాంగితో 'దేవీ ! నీ కంటె శక్తిమంతులును అదృష్టవంతులును అగు స్త్రీలు ప్రపంచములో గలరు. వారికి నమస్కరించుచున్నాను' అనెను. పార్వతి ఆశ్చర్యపడి తనకంటె శక్తివంతురాలైన ఒక స్త్రీని చూపుమని భర్తను వేడెను.

పార్వతీ పరమేశ్వరులు ఒక పొలమునకు వెళ్ళిరి. అచ్చట ఒక రైతు తన పొలమును దున్నుచుండగా పాముకరచి వెంటనే మరణించెను. సమీపమున గల రైతులు దుఃఖపడి ఆ శవమును ఇంటికి మోసికొని వెళ్ళిరి. ఇదిచూచి మరణించిన రైతు భార్య తలదువ్వుకొని, స్నానమాచరించి, విలువగల దుస్తులు ఆభరణములు ధరించి తన భర్తను బ్రతికించవలసినదిగ పరమేశ్వరుని ఏకధ్యానముతో ప్రార్థింపసాగెను. ఆ సమయమునకు పార్వతీ పరమేశ్వరులు అచ్చటికిరాగా, పరమేశ్వరుని కాళ్ళపైబడి తన భర్తను బ్రతికించవలసినదిగ దీనవదనయై దుఃఖించుచు ప్రార్థించెను. పరమేశ్వరుడు ఆమె భక్తికిమెచ్చి భర్తను బ్రతి

కించెను. భర్తను బ్రతికించుకొనుశక్తి గలిగిన స్త్రీని చూచి పార్వతి నివ్వెరపడెను. పరమేశ్వరుడు భార్యతో 'ఈ రైతు భార్య నీ కంటె శక్తివంతురాలు కాదా?' అని మందలించెను. పార్వతి తన తప్పును తెలిసికొని భర్తను క్షమింపుమని వేడెను. సంచారజాతులు చెప్పుకొను ఈ కథలు మన పౌరాణిక గాథలకెందును తిసిపోవని స్పష్టపడుచున్నవి.

కాశీమజిలీల కథలను మరిపించుకొన్ని కథలను సంచారజాతులు చెప్పు కొందురు. ఈ దిగువ కథ చూడుడు.

ఒక రాజు తనకు పిల్లలులేనందున జ్యోతిషపండితులను పిలిపించి సంతానము కలదేమోనని విచారించెను. పండితులు దీర్ఘముగాఆలోచించి, గణితమును లెక్కించి రాజుగారికి త్వరలో మగశిశువు కలుగునని చెప్పిరి. కొద్దికాలమునకే రాణి గర్భము ధరించెను. ఆడశిశువు కనెను. ఇది రాజుగారిని చాల కలవరపరచినది. ఆడశిశువు కలిగినదనువార్త కడురహస్యముగనుంచి, మగశిశువు కలిగెనని రాజుగారు ప్రకటించెను. రాజదంపతులకు మగశిశువు కలిగెననియే అందరు సంతోషించిరి. బాలికకు బాలునివేషమువేసి గారాబముగ పెంచుచుండిరి అదేవేషముతో ఆ బాలికను బడికి పంపిరి. బడిలో బాలునివేషముతో నున్న ఈ బాలికకు సహధ్యాయియగు ఇంకొక బాలునితో స్నేహమేర్పడెను. ఆ బాలుడు సూక్ష్మబుద్ధికలవాడు కనుక మారువేషముతోనున్న బాలిక లక్షణములను గ్రహించెను. నిజము తెలిసికొనవలెనని స్నేహరీత్యా తమ చొక్కాలను మార్చుకొందమని రాజకుమార్తెను బలవంతపరచెను. రహస్య మెటులైనను ఇకదాగదని తలంచి తన నిజస్థితిని ఆ బాలునికి చెప్పెను. వారి స్నేహము క్రమముగా అభివృద్ధిపొంది ప్రేమలోనికి దిగినది. కొన్ని సంవత్సరములకు ఇద్దరును పరాయిదేశమునకు పోవుటకు నిశ్చయించుకొనిరి. పారిపోవుటకు నిశ్చయించుకొనిన రాత్రి, తన తండ్రికి అకస్మాత్తుగ జబ్బుచేయుటచే, అనుకున్నట్లు యువకుడు రాలేకపోయెను. వీరి ఈ రహస్యోదంతమును కనిపెట్టుచున్న ఇంకొక యువకుడు ఆ సమయమునకు రాకుమారి దగ్గరకువచ్చి చీకటిలో ఆమెను మోసపుచ్చి గుఱ్ఱముపై ఎక్కించుకొని తీసికొని వెళ్లెను. తెల్లవారగనే రాజకుమారి తనకు జరిగిన మోసము తెలిసికొని చాలవిచారపడెను కాని తన దుఃఖమును లోలోనక్రమింగి, సంతోషముగ ఉండినట్లు నటిం

చెను. వారిద్దరు పరాయిదేశమునకు వెళ్ళి ఒక బంగాళాలో చాలకాలము నివసించిరి. రాజకుమారి తెచ్చిన డబ్బుతో ఇద్దరు కాలముగడిపిరి. తెచ్చినడబ్బు అయిపోయిన తరువాత జీవనము గడచుట కష్టమగుటచే ఆ దేశపు రాజు దగ్గరకువెళ్ళి ఆశ్రయించిరి. ఆ రాజు యువకుని తన దివానుగా ఏర్పాటుచేసికొని, వీరు నివసించుట కొరక పెద్ద బంగాళా ఇచ్చెను. దివాను కచేరినుండి ఇంటికి వెళ్ళుదారిలో ఒక వేశ్య గలదు. ఈ వేశ్య దివానును మోహించ విశ్వప్రయత్నము చేసి ఆతనిని లోబరచుకొనెను. రాజు తన దివాను రాజకీయచతురతచూచి మెచ్చుకొని ఆతనికి ఒక బంగారపు గొలుసు బహుమతి యొసంగెను. ఆ బహుమతి పుచ్చుకొని సరాసరి నదిలో స్నానము చేయుటకు వెళ్ళి గొలుసును ఒడ్డుపైపెట్టి మరచిపోయి స్నానానంతరము వేశ్యయింటికి వెళ్లెను. ఇంటిలో వేశ్య లేకుండుటచూచి తిరిగి వెళ్లుచుండగా పాముచే కరువబడి స్మృతిలేక పడిపోయెను. వేశ్య తన ప్రియుడు మరణించుట చూచి విచారపడి మందు ఇచ్చి అతనిని బ్రతికించెను. కాని తనను వదలి వెళ్ళునని భయముతో మాయపొడి అతనిపై జల్లి పావురముగ మార్చెను. రాత్రిళ్ళు మాత్రము మనుష్య రూపముదాల్చునట్లు చేయుచుండెను.

వేశ్య పావురమును ఒక పంజరములోనుంచి బహుజాగ్రత్తగ కనిపెట్టుచుండెను. కాని ఒకరోజున పావురము ఎట్లో తప్పించుకొని తన యింటికి యెగిరిపోయెను. రాకుమారి ఆ పావురపు అందమునుచూచి ముద్దిడుకొనుచుండెను. ఇంతలో పావురముపై జల్లిన మందు ప్రభావము తగ్గుటచే మరల తన మనుష్యాకృతిగ మారుచుండెను. ఇట్లు మనుష్యాకృతిగ మారుచున్న యువకునిచూచి చుట్టుపట్ల ఉన్నవారు అతనిని పట్టుకొనుటకు ప్రయత్నించిరి. కాని ఆ యువకుడు ఒక ఇంటిపైనుండి ఇంకొక ఇంటికి ఎగురుచు ఒక వైశ్యుని ఇంటి పైకప్పున నిల్చెను. వైశ్యుడు అతనిని పట్టుకొని అతనిని తన కూతురును ఒక గదిలో పెట్టి తాళము వేసెను. చివరకు ఈ యువకుడు వైశ్యుని కూతురును, వేశ్యను, రాకుమారిని ముగ్గురిని పెండ్లి చేసికొని సుఖముగా ఉండెను."

ఇట్టి కథలెన్నియో వీరు చెప్పుకొనెదరు. ఈ కథలు ఎంత విన సొంపుగా ఉన్నవో నీతివంతంగా ఉన్నవో కదా! ఉదాహరణకు కొన్నిటిని మాత్రమే ఇక్కడ వివరించడం జరిగింది.

ఈ క్రింది నీతులు తెలుపు కథలను సంచారజాతులు చెప్పుకొందురు. గ్రంధవిస్తరణ భీతిచే కథలయొక్క నీతులను మాత్రమే వివరించడం జరిగినది.

1 అబద్ధమాడువారు నిజమాడినను ఎవరును నమ్మరు.
2 పాత్రాపాత్రములను గుర్తించి సాయపడుము.
3 ఆపదలలో నున్నవానికి సాయపడుము.
4 ఇతరులను హింసించుచు తాను ఆనందించువాడు క్రూరుడు.
5 తన్ను తాను పొగడుకొనువాడు బుద్ధిహీనుడు.
6 ఎవరిని దూషింపకుము.
7 ఆపదలో నున్న వానిని పరిహసింపకుము.
8 నిజాయతీయే నిన్ను రక్షించును.
9 ఇతరుల భాగ్యమును చూచి ఈర్ష్యపడకుము.
10 సౌందర్యముకన్న సద్గుణమే మేలు.''

## కొన్ని పొడుపుకథలు:-

"సంచారజాతులకు పొడుపుకథలను చెప్పుకొనుటయందు ఆసక్తి మెండు. వానిలో కొన్ని వినుటకు సొంపుగనుండును.

1. ''వెనుకజూచిన కన్నె
ముందుజూచిన కన్నె'' — ఎండ్రకాయ
2. ''చెట్టుపైకి ప్రాకి కూర్చుండును
పొదతోకతో నాట్యమాడుచుండును.'' — నెమలి
3. చిన్నతనముతో గుడ్డకట్టుకొనును
వయస్సువచ్చిన దిశమొలతో నుండును. — వెదురు
4. చిన్నపిల్ల పెద్దకుండను మోస్తుంది. — పొయ్యి
5. రాజుగారి పూజాపాత్ర,
అంటటానికి వీల్లేదు .... — తేనెగూడు
6. రాజుగారి కొంగ
దానికి ఒక్కటేకాలు — గొడుగు
7. రాజులుతినే వంకాయకు కొడ ఉండదు — కోడిగ్రుడ్డు

8. పుట్టి బియ్యపు గింజలలో ఒకటే రత్నం .... చంద్రుడు
9. ఇక్కడ ఉన్నది అక్కడ ఉన్నది
ఎంతదబ్బిచ్చినా దొరికేదికాదు .... వెలుతురు
10. తల్లి పడుచుగానే యున్నది
కూతురు ముసలిదైనది .... మొక్కజొన్న
11. రాజుగారి కూరలోకి కూడ
అది లేకపోతే రుచించదు .... ఉప్పు
12. రెండు పొట్టలుండును
రెండు కండ్లుండును .... నాగస్వరము
13. రాజుగారి మేడ
రాత్రిలో తయారైంది .... ఎలుకకన్నము
14. గ్రామపంది కొక్కు
చూచినావ చిన్నవాడ .... పంది
15. రాజుగారి కండువా
అంతులేని పొడుగు. .... రోడ్డు"

## వీరి భాషలు:-

సంచారజాతులలో కొందరికి ప్రత్యేకమైన ఏదో ఒక భాషకలదు. పాశ్చాత్య దేశాలలో నివసించు సంచారజాతులకు ఒక్కొక్క జాతికి ఒక్కొక్క భాష కలదు. వీరిలో కొందరు ద్రావిడభాషకు చెందినవారు. కొందరు మంగోలియన్ భాషకు చెందినవారు. సామాన్యముగా వీరి భాషలన్నియు పరిసరప్రాంతములలో వాడు భాషలోగల కొన్ని మాటలతో మిశ్రితములై యుండును. మన రాష్ట్రంలో ఎరుకల వారికి, లంబాడీవారికి ప్రత్యేకమగు భాషలు కలవు. ఎరుకలభాషలో అరవ, తెలుగుపదాలు ఎక్కువగా కానవచ్చును. లంబాడీభాష రాజస్థాన్‌భాషకు చేరువగా ఉండును. ఇందులో తెలుగుపదములు కలిపియుండును. సంచారముచేయు జాతులకు హిందూస్థానీ కొంతవరకు వచ్చియుండును. కొన్ని జాతులు తమ భాషను పూర్తిగా మరచిపోయి ప్రాంతీయభాషలనే వాడుచున్నారు. యానాదులు, ఊర చెంచులు ఈ తరగతిలో చేర్చవచ్చును. అడవిచెంచులకు ప్రత్యేక భాషకలదు.

సంచారజాతులు మాట్లాడు కొన్ని భాషలలోని కొన్ని మాటలు:—

| | తెలుగు | ఎరుకల | చెంచు |
|---|---|---|---|
| 1. | గాలి | గాలి | బటాస్ |
| 2. | పక్షి | కొక్కు | చోడై |
| 3. | పడవ | పడవ | లా |
| 4. | కుక్క | నాయి | కుక్కు |
| 5. | తండ్రి | ఆవ | బా |
| 6. | తల | తలాయి | ముండ్ |
| 7. | ఆకు | యాలే | పాత్ |
| 8. | తల్లి | తాయి | మా |
| 9. | రాత్రి | రాత్ర | రయిత్ |
| 10. | ఉప్పు | సొనవ | నూన్ |
| 11. | గ్రామము | నాడు | గా |
| 12. | ఒకటి | వొండు | యేక్ |
| 13. | తిను | పును | ఖా |
| 14. | నల్లని | కాలేదా | కల్లా |
| 15. | ఆకలి | సోడా | భూక్ |

| | తెలుగు | తోడ | కురుంబ | ఇరుల |
|---|---|---|---|---|
| 1. | బిడ్డ | పోనెన్ఎన్నె | కూసు | పుల్లే |
| 2. | తండ్రి | ఏయన్ | తండే | అమ్మె |
| 3. | పుష్పము | పుష్ | హూక్ | పు |
| 4. | గుఱ్ఱము | కడారే | కుడూరే | కుడూరే |
| 5. | మనుష్యుడు | అల్ | మానిషా | మానిషా |
| 6. | పేరు | పెర్ | హీసకేపేరే | హీసునే |
| 7. | నది | పా | నీరు | పల్లా |
| 8. | పాము | పాబ్ | పుపూ | పాంబూ |
| 9. | భార్య | కుయిగొప్ | హిందరు | హొందు |

| | తెలుగు | తోడ | కురుంబ | ఇరుల |
|---|---|---|---|---|
| 10. | నాది | యెన్నడు | యెన్నడు | నన్నడు |
| 11. | నూరు | వద్దునూరు | నూరు | నూరు |
| 12. | ఇక్కడ | ఇత్ | ఇల్లి | ఇంగే |
| 13. | దూరము | పొడ్డడ్షి | దూర | దూర |
| 14. | తిను | దెస్తుబిన్ | తినసే | తింకే |
| 15. | నవ్వు | కస్తబ్సి | వగ్గేకన్ | జరికే |
| 16. | మాట్లాడు | ఎష్తచివి | మేదిదస్నే | పీషికే |
| 17. | ఏను | కెల్తుఅనే | క్రెటినే | కిల్‌కే |
| 18. | వేడి | కిస్తి | బిస్తే | కాజ |
| 19. | నల్లని | కస్థతి | కొప్పు | కరి |
| 20. | తెల్లని | బెబ్బు | లోలె | వెల్లె |
| 21. | చతురము | కాసిత్ | జంకా | జవుకా |
| 22. | దప్పిక | మిర్చస్తి | అరువ | వెకే |
| 23. | ఆకలి | భీర్యస్థితి | హోసు | పస్సి |
| 24. | అలసట | కాసెత్ | సలుపు | సలిపు |
| 25. | కూర్చొను | నెష్కిల్ | కులికుటినే | మకులే |

సంచారజాతులలోనే కాదు ఏ జాతులలో లోపాలులేవు? నవీననాగరికులను చెప్పుకొను ఆధునికులలో ఎన్ని దుర్గుణాలు లేవు. అటువంటప్పుడు అనాగరికులు, నిరక్షరాస్యులు, నిరంతరము తిరిగేవారిలో కొన్ని చెడ్డగుణాలు ఉన్నంత మాత్రాన వారిలో సంస్కృతి లేదనుకొనుట పొరపాటు. కనుకనే సంచార జాతుల సంస్కృతి సదాచారాలను గురించి ఇంతగా చెప్పవలసివచ్చినది.

సంచార జాతులలోని సద్గుణాలగు నిరాడంబరత్వము, అతిధిసత్కారము, నిష్కాపట్యము, నిజాయితీ, స్నేహశీలత్వము, ప్రకృతిని ప్రేమించుట, సంతృప్తి మున్నగునవి మహోత్కృష్టములు.

# 5. సంచారజాతుల సంక్షేమం

ప్రపంచంలోగల అన్ని దేశాలలోను సంచారజాతులు కలరని మనము తెలిసికొనిఉన్నాము. వీరిని ఉద్ధరించుటకు అన్ని దేశాలలోను ప్రయత్నాలు జరుగుచున్నవి. వీరికి స్థిరనివాసము కలుగచేయుట ఆ ప్రయత్నాలలో ముఖ్యమైనది. ఇందు ఏ ప్రభుత్వము ఇంతవరకు పూర్తిగా కృతార్థతచెందలేదు. అభివృద్ధిచెందిన దేశాలు సైతము సంచారజాతులకు కొంతవరకు ఆర్థికస్తోమత మాత్రమే చేయ కలిగినది. అంతమాత్రాన వారు అభివృద్ధియైనట్లు ఎంచుటకు అవకాశం లేదని ఆయాప్రభుత్వాలే వెల్లడిస్తున్నారు.

అఖిలభారత సంచారజాతుల సంఘాధ్యక్షులగు శ్రీ యు. యన్. దేబర్ వీరిని బాగుచేయుటకు ఈ క్రింది నాలుగు సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చుచున్నదని వ్రాసియున్నారు.

"(1) వారి సాంఘిక స్థితిగతులు మనకు సరిగ తెలియకపోవుట
(2) వారి నిరంతర దారిద్ర్యము
(3) వారిలో నిరక్షరాస్యతా నిర్మూలనము
(4) వారికి పునర్నివాసము కల్పించుట."

ఈ విషయాలలో ఇంతవరకు వారిని పూర్తిగా నిర్లక్ష్యంచేయడం జరిగింది. సంచారజాతుల సంక్షేమానికి కృషిచేయునపుడు ఈక్రింది ముఖ్యవిషయాలు దృష్టిలో పెట్టుకోవలసియున్నదని శ్రీ దేబర్ వివరించియున్నారు.

"(1) వారికి కొన్ని సాంప్రదాయాలున్నాయి. క్రమశిక్షణకు, నీతి నియమములకు ఆచార వ్యవహారాలకు తరతరాలుగా వస్తున్న కొన్ని సిద్ధాంతాలున్నవి. వాటిని వీరు ఈనాటికి కాదనలేరు, వదలుకోలేరు.

(2) వారు ఆరోగ్యవంతులు, దృఢకాయులు, కాయకష్టముచేసి జీవించ గలరు. ఎండకు, వానకు, చలికి ఏ శీతోష్ణస్థితికైనను తట్టుకోగల శరీర దారుఢ్యం కలవారు.

(3) వారు నిరంతరం సంతోషంగా ఉంటారు, చురుకుగా ఉంటారు, విధేయతతో ఉంటారు, శరీరశ్రమ చేయగలరు, సమిష్టిగా జీంవిచగలరు. ధైర్య స్థైర్యములు కలవారు. ప్రేమస్వభావం గలవారు. అవసరమొచ్చినపుడు ఎన్ని కష్టాలైనను ఎదుర్కొని నిజం చెప్పగలరు.

(4) వారి వృత్తినిగురించి వారికి బాగుగా తెలియును, వ్యాపారసరళి తెలియును. అందు కళాత్మకమైన జీవితము గడుపగలరు."

ఈ ముఖ్యవిషయాలు దృష్టిలో ఉంచుకొని సంచారజాతులలో దారిద్ర్యము, నిరక్షరాస్యత నిర్మూలించుటకు గట్టి ప్రయత్నాలు చేయవలయుననియు, ఇందుకు ప్రధానంగా వీరికి పునర్నివాస సౌకర్యములు కలుగచేయవలెననియు, కేంద్ర రాష్ట్రప్రభుత్వము లిందు పూనుకొనవలెననియు శ్రీ దేబర్ పలుమారులు ప్రబోధించియున్నారు.

కేంద్ర, రాష్ట్రప్రభుత్వములు షెడ్యూల్డు తరగతులను, షెడ్యూల్డు జాతులను అభివృద్ధిచేయుటకు ఎంతగానో కృషిచేయుచున్నవి, ఎంతో డబ్బు ఖర్చుచేయుచున్నవి. కాని సత్ఫలితాలు అంతగా కలుగుటలేదు. కారణాలు మనం అన్వేషించి సరిచేయవలసియున్నది.

వీరందరిని బాగుచేయుటకు కేంద్ర, రాష్ట్రప్రభుత్వములు పెద్ద పెద్ద మొత్తములు కేటాయించినవి. కాని ఎప్పుడూ తిరుగుతుండే సంచారజాతులకు ఈ సహాయం సరిగా అందుటలేదు. ఈ సహాయం అందుకొనుటకూ సంచారజాతులు ఎట్టి సుముఖత చూపుటలేదు. షెడ్యూల్డు తరగతులకు తదితర స్థిరనివాసముగలవారికి మాత్రమే ఈ ఆర్థికసహాయము చెందుచున్నదనుటలో అతిశయోక్తిలేదు.

గృహవసతి కలుగచేయడం, భూములను కేటాయించడంవలన మాత్రమే వీరిని బాగుచేయుటకు ఆస్కారం లేదు. ఇంతకంటె ముఖ్యమైనది, వీరి విశ్వాసం ముందుగా చూరగొనవలసియున్నది. సంచారజాతులదగ్గర ఎట్లు సంచరించవలెనో ముందు నేర్చుకొనవలసి యున్నది. వారొకదారిలో సంచరించుచున్నారు. మన మొక దారిలో వారిని త్రిప్పుచున్నాము. ఈ రెంటికి చాల తేడా ఉన్నది. సరియైన దారిలో ఈ పని సాగించనియెడల వారికి ఏదీ పట్టుబడక రెంటికి చెడిన రేవడవలె భ్రష్టులగుటకు అవకాశం కలదు.

కాలనీలలలో వీరికి స్థిరనివాస మేర్పరచుటకు ఇంతవరకు చేసిన ప్రయత్నములు ఫలించలేదనే చెప్పవలెను. దీనికి ముఖ్యకారణము ఆ జాతులకు స్థిరనివాసములో సంతోషములేదు. అందువలన వారక్కడ నివసించకున్నారు. ఎంత సేపూ మనం వారికి అన్నివసతులు కలుగచేయుటకు ప్రయత్నిస్తున్నాము వారేమో నిర్లిప్తంగా ఉండి పట్టీ పట్టనట్లుగా అంతా మనమే చేయగలమని మిన్నకుంటున్నారు. ఇండ్లు కట్టించిన సందర్భాలున్నాయి. సాగుకు భూమియు ఇచ్చియున్నారు. సాగుచేసి కొనుటకు అన్ని వ్యవసాయపు పనిముట్లు ఇచ్చియున్నారు. విత్తనాలు, మందులు ఒకటేమిటి, పంటవచ్చువరకు వారికి ఆర్థికసహాయము చేయబడుచునేఉన్నది. ఇన్ని చేసినను వారు కుదుట పడుటలేదు. ఆదిమవాసులలో కొందరు కాలనీలలో ఉండుటకు కొంతవరకు అలవాటుపడిరి. కాని సంచారజాతులు ఇందుకు ఎంతగా సాయ పడినను సుముఖంగాలేరు. నేనొకచోట ఉద్యోగిగా ఉన్నపుడు గ్రామస్థుల సహాయంతో సంచారజాతులకు ఒక కాలనీ కట్టించుట జరిగినది. ఒక్కొక్కరికి అయిదుసెంట్లు భూమి, ఇల్లు ఇవ్వబడినది మంచినీటివసతి కలుగచేయబడినది. ఉన్నట్లే ఉండి ఒక అర్ధరాత్రి అందరూ తట్టాబుట్టతో లేచిపోయిరి. ఇందుకు చెప్పదగ్గ కారణమేమి కనబడదు. మద్రాసురాష్ట్రంలో పూసలవారికి రాష్ట్ర ప్రభుత్వం ఒక మంచి కాలనీ కట్టించినది. అన్నివసతులు కలుగచేసినది. నేను ఒక సంవత్సరం తరువాత చూడటానికి వెళ్తే అది నిర్మానుష్యంగా ఉన్నది. ఏమిచెప్పము ?

సంచారజాతులతో పని, ముందుగా వారినిగురించి సంఘసేవకులు క్షుణ్ణంగా తెలిసికొనవలసియున్నది. వారి ఆచార వ్యవహారాలు, నమ్మకాలు, బాగా తెలిసికొనవలెను. కనుక మానుషశాస్త్రవేత్తల సలహాలు తీసికొని కాని వీరిని ఉద్ధరించుటకు పూనుకొనకూడదు.

సంచారజాతులను బాగుచేయుటకు కేంద్రప్రభుత్వమేగాక అన్నిరాష్ట్రాల ప్రభుత్వాలు పెద్ద పెద్ద మొత్తాలలో గ్రాంట్లు మంజూరు చేయుచున్నారు. కాని అవి సకాలంలో ఖర్చుచేయుటకు ఎంత ప్రయత్నించినా వీలుపడుటలేదు. మరుసటి సంవత్సరము ఖర్చు చేయుటకు వీలులేదు. ప్రభుత్వం ఖర్చుచేయనీయదు. ఇటుల ఎంతో మొత్తం వినియోగం కాకుండ (lapse) అవుతున్నది.

సంచారజాతులను అభివృద్ధిలోనికి తీసికొనిరాదలచినవారు వారిని ఒకేసారి మార్చుటకు ప్రయత్నించకూడదు. వారితో క్రమక్రమంగా సంబంధం ఏర్పరచుకోవలసియున్నది. వాళ్లను అర్థం చేసికొనవలసియున్నది. వారి మనస్సులకు ఆహ్లాదం చేకూర్చవలసియున్నది. వారికి గుడ్డలు, ఆహారము, వలయుమందులు ఇస్తూ వారితో పరిచయం పెంచుకోవలసియున్నది. తరువాత వారికి క్రమంగా సంచార సహకార సంఘాలద్వారా చౌకధరలకు వస్తువులను సరఫరా చేయుటమున్నగునవి జరుపవలెను. కేంద్ర ప్రభుత్వపు మానుషశాస్త్రశాఖ మాజీ డైరెక్టర్ ఈ విషయాలలో సలహాయిస్తూ "వీరిని ఉద్ధరించుటకు అవలంభించు మార్గములు క్రమ క్రమంగా అమలుచేయలెకాని ఒకేసారి అమలు చేయరాదు. వారు ప్రతినిత్యము చేయు వేట, ఆహారమును సంపాదించుటకు వారు లోగడ అవలంభించు మార్గములకు అడ్డురాకూడదు వాటిని చేయనిచ్చుచునే ఉండి క్రమంగా ఇతర పద్ధతులకు వారు అలవాటుపడునట్లు కృషిచేయవలెను."

చాలచోట్ల ప్రభుత్వం వీరికి కాలనీలను నిర్మిస్తున్నది. కాని ఈ కాలనీలను రోడ్ల ప్రక్క ఇతరులకు చూపెట్టుటకో (show) అన్నట్లు నిర్మిస్తున్నారు. ఉద్యోగుల రాకపోకలకు ఇది అనువగునే కాని ఇట్టి వాతావరణం సంచారజాతులకు అంతగా గిట్టనిది. ఎక్కువ జనసంచారంలేని ప్రదేశాలలో వీరుండుటకు అలవాటు పడినారు కనుక వీరికి కాలనీలు దూరప్రదేశాలలో నిర్మించుట అనుకూలము.

ఈ కాలనీల నిర్మాణములో ఇంకొక విషయం ముఖ్యంగా గమనించవలసియున్నది. సంచారజాతులకు ఉద్యోగులనిన భయం మెండు. ఇది మొదటినుంచి వస్తున్నదే. అందువలన ఈకాలనీల నిర్మాణము, నిర్వహణము అధికారేతరులగు సంఘ సేవకులకు అప్పగించుట మంచిదని మానుషశాస్త్రజ్ఞుల అభిప్రాయము.

ఈ కాలనీల నిర్మాణంలో ఇంకొక పొరపాటు జరుగుచున్నది. కాలనీలలో వీరికై మిద్దెలు, పెంకుటిళ్లు కట్టబడుచున్నవి. చిన్న చిన్న గుడిసెలలో నివసించుటకు అలవాటుపడిన వీరు ఇట్టి ఖరీదుగల ఇండ్లలో నివసించుటకు విముఖత చూపుచున్నారు. ఆ ఇండ్లలో నివసించుటకు వారు ఇబ్బందిపడి అక్కడ నుండి తప్పించుకొని పారిపోవుటకు ప్రయత్నించుచున్నారు. కనుక వీరికి కాలనీలు ఏర్పాటు చేయుటలో ఈ క్రింది సూచనలు గమనించవలసియున్నది.

(1) గ్రామాలకు కొద్ది దూరంగా అడవులకు దగ్గరలో వీరికి కాలనీలు నిర్మించుట శ్రేయస్కరము. వారికి అలవాటగు వేటకు పోవుటకుకూడ వీరికి అవకాశం కల్పింపవలెను.

(2) ప్లాను ప్రకారం ఇంటికి చుట్టుపట్ల విశాలమగు స్థలము కేటాయించవలెను. కాయ, కూర పండించుకొని అమ్ముకొనుటకు అనువగునట్లు ప్రోత్సహించవలెను. పశువులను పెంచుటకు స్థలముండవలెను.

(3) మొదట్లో పక్కా ఇండ్లుకాక, వారికి అలవాటగునంతవరకు చక్కగా పూరిండ్లు నిర్మించుట మంచిది. ఆ ఇండ్లకు కావలసిన కలప, తాటాకు వగైరా వారికే అప్పగించి ఆ ఇండ్ల నిర్మాణము వారే చేసికొనునట్లు ప్రోత్సహించవలెను. అప్పుడే వారికి ఆ ఇల్లునాది అనేభావన కలుగకలదు.

(4) మంచినీటివసతి కలుగచేయవలెను. సంచారజాతులకు అంటువ్యాధులంటే సహజమైన భయం కలదు దయ్యాలన్నా, భూతాలన్నా, మహమారియన్నా వీరికి అమిత భయం.

ఏమైనా, సంచారజాతుల మనస్తత్వం పూర్తిగా అర్థంచేసికొనినవారే వారిని బాగుచేయుటకు ఆచరణయోగ్యమగు మార్గములను అనుసరించగలరు.

మద్రాసురాష్ట్రంలో ఒకచోట చిత్తశుద్ధి, ఉత్సాహియగు ఒక జిల్లాకలెక్టరు ఒకకొండపైగల ఒక సంచారజాతి గ్రామములో అంటువ్యాధిని నిర్మూలించవలెనని తన సిబ్బందితో స్వయంగా ప్రయత్నించి కొండ ఎక్కలేక ఎక్కలేక ఎంతో

కష్టంతో ఎక్కి తిరిగివచ్చి ఈ జాతులను కొండలపై నివసింపచేయరాదనియు బల వంతంచేసియైనను కొండక్రింద నివసించునట్లు చేయవలెనని పై అధికారులకు వ్రాసి యుండెను. కొండలపై వీరు నివసించుచో ఉద్యోగులు వీరికి సాయపడుట కష్ట మని వీరి భావన. మహమ్మదు కొండదగ్గరకైనా వెళ్లవలెను లేక కొండ మహ మ్మదువద్దకు రావలెననే సూక్తి మనకు తెలియునుకదా!

సంచారజాతులను బాగుచేయుటకు సిద్ధపడు సంఘసేవకులు వారు అధికా రులు కానీయండి అనధికారులు కానీయండి ఎంతో ఓర్పు, సహనము చూపవలెను. ఏమోమో సౌకర్యాలు కల్పించి వారిని సంతోషపెట్టుటకు ఆదుర్దాపడుచో, వారిని అసంతృప్తిపరచుటయే జరుగగలదు. వారిలో ఎన్నో లోపాలుండవచ్చును. వాటిని ఎత్తిచూపి ఆక్షేపించువో, వారు మనను ప్రేమించకపోగా మనకు దూర మగుదురు.

ఈ సందర్భంలో డా॥ ఎల్విన్ మహాశయుని అభిప్రాయాలు గమనించవ లసియున్నది. "కొన్ని వందల సంవత్సరాలుగా ఈ జాతులవారు పరాయివారిని దగ్గరకు రానిచ్చేవారు కాదు. అనుమానంవలననో, భయంవలననో ఈ విధంగా చేసేవారు. కాని ఇటీవల వీరిలో కొంతమార్పు వచ్చింది. ధైర్యంగా ఇతరులతో మాట్లాడుతున్నారు. సహజంగా వారిలోగల వారి అతిథులను గౌర వించు పద్ధతి ఇప్పుడు ఇతరులకు కూడ విస్తరింపచేస్తున్నారు. ఇది గణనీయం కదా! ఏమైనా వీరిలో మార్పు క్రమక్రమంగా జరుగవలసియున్నది ఇది నిర్మాణ కార్యకర్తలు ముఖ్యంగా గుర్తుంచుకోవలసియున్నది."

ఈ విషయంలో ప్రత్యేక విజ్ఞానంగల శాస్త్రవేత్త జె. పి. మిల్స్ వ్రాయుచూ "నాగజాతిలో ఒకరినొకరు చంపుకొను అలవాటు కలదు. తలలు త్రుంచి వాటిని ఊరేగించుట ఒక ఘనంగా భావించేవారు. ఇప్పుడు వీరిలో ఇది అంతరించినది. దీనిని తొలగించుటకు కొన్ని వందలసంవత్సరాలు పట్టియుండవచ్చును." వీరిని బాగుచేయుటకు ఎంతటి ఓర్పు కావలెనో దీనివలన విదితమగుచున్నది.

సంచారజాతులకు ప్రత్యేక మతమనునది లేకపోయినను, వారికి కొన్ని నిర్దుష్టములగు మతపరమైన సిద్ధాంతములు కలవు. వీరిని బాగుచేయుట కుద్యమించు కార్యకర్తలు ఈ క్రిందివిషయాలు విస్మరింపరాదు.



మొండిబండ వారి ప్రదర్శనము

(1) సంచారజాతుల నివసించు ప్రదేశములలో గల మత సిద్ధాంతములను తెలి కొని వాటిని క్షుణ్ణంగా అర్థం చేసికోవలెను.

(2) సంచారజాతులు వారి వారి మత సిద్ధాంతముల ప్రకారం ఆచరించు కర్మ లను కాని ఉత్సవాలను కాని చూచి విమర్శించరాదు, పరిహసించరాదు.

(3) వీరితో మాట్లాడునపుడు చాల జాగ్రత్తగా ఉండవలెను. వారికి ఇష్టము లేని మాటలు పలుకరాదు. "మూఢనమ్మకాలు" "దయ్యపునాట్యము" "వెనుకబడినతనం" "అభివృద్ధి" మున్నగు మాటలు వాడరాదు. వారికి తెలియని మాటలు వాడితే వారికి అర్థంకాక అపార్థం తీసికోటానికి ఆస్కారం ఉన్నది.

(4) వారు చెప్పుకొను దేవుళ్ల పేర్లే మనంకూడా ప్రస్తావించుచుండవలెను. క్రొత్త క్రొత్త పేర్లు వారిని కంగారుపెట్టగలవు.

వీరిని ఉద్ధరించు కార్యకర్తలు తామేదో గొప్పవారమని వేషంలోకాని, భాషలోకాని, క్రియలోకాని చూపెట్టరాదు. వారిలో కలిసిమెలిసి వారి స్థాయికి దిగ జారి వారిని ఉద్ధరించుటకు ప్రయత్నం చేయవలెను. డాక్టర్ ఎల్విన్‌ను చూడండి. ఎంతటి ఆదర్శపురుషుడో! ఆయన తెల్లవాడు, డాక్టరేట్‌వరకు చదివిన విద్యావేత్త. వారిదేశంలో తనకు లభించు అన్ని పదవులు కాలతన్ని భారతదేశం వచ్చి ఆదిమ వాసులను ఉద్ధరించుటకు పూనుకొని అడవులలో పెక్కు సంవత్సరాలు గడిపి వారితో నివసించి వారిని అర్థంచేసికొని ఉద్ధరించుటకు ప్రయత్నించియుండెను. ఆదిమవాసులను గురించి ఎన్నో ఉద్గ్రంథాలు రచించి ప్రచురించియుండెను. తనూ ఒక ఆదివాసిగనే జీవితము గడిపెను. ఆదివాసి స్త్రీనే వివాహం చేసికొనెను. ఇందువలన డాక్టర్ ఎల్విన్ ఎంతటి త్యాగధనుడో, ఎంతటి విజ్ఞానవంతుడో, ఎంతటి ధీశాలియో, ఎంతటి ధైర్యవంతుడో మనకు తెలియగలదు. వీరిని ఉద్ధ రించుకొనదలచిన కార్యకర్తలకు దీనజనులపాలిటి పెన్నిధియగు డాక్టర్ ఎల్విన్ మహాశయుని జీవితము సర్వదా ఆదర్శప్రాయము కావలసియున్నది.

సంచారజాతులను ఇతరులనుండి పూర్తిగా వేరుచేయుటకు సుప్రసిద్ధ మానుషశాస్త్రవేత్త డా॥ గుహ పూర్తిగా వ్యతిరేకులు. అటుల చేయుచో వారిని

జైలులో నిర్బంధించినట్లే అని వారి అభిప్రాయము. సాధ్యమైనంతవరకు ఇతరులకు దగ్గరలోనే నివసింపజేసి వారితో కలిసిమెలిసి ఉండునట్లు అలవాటు చేయవలెనని వారి భావన. పూజ్యులు తక్కార్ బాపా కూడా ఇదే అభిప్రాయాన్ని పదే పదే వెలువరచియున్నారు. దేబర్ కమీషన్‌వారు ఈ విషయం గట్టిగా చెప్పియున్నారు.

సంచారజాతులను ఉద్ధరించు ప్రయత్నములో వారిలో తరతరాల నుండి వస్తున్న పంచాయతీపద్ధతిని కాదనరాదు. చిన్న చిన్న తగాదాల పరిష్కారము వాటికే వదలవలెను. వారి నాయకుని త్రోసి రాజనకూడదు. అతని ప్రాముఖ్యతను తగ్గించకూడదు.

సంచారజాతులకు స్థిరనివాసము కల్పించినంత మాత్రముననే వారు బాగుపడెదరని తలపరాదు. వారు తిరుగుచున్నంత కాలము అడవులలో తిరిగి వేటాడి ఆహారము సంపాదించుకొనుచుండెడివారు. ఏదో ఆహారము వారికి దొరికి తీరెడిది. కాని స్థిరనివాసమువలన ఆహారము సమకూర్చుకొనుట వారికి ఒక సమస్య అవుచున్నదని మానుషశాస్త్రజ్ఞులే తెలుపుచున్నారు. కూలికో, ఫ్యాక్టరీపనికో లేక ఇతర పనులు చేసికొని జీవించు అలవాటుపడువరకు వీరిపరిస్థితి గడ్డుగానే ఉండగలదు. పై స్థితికి క్రమంగా గాని వారు రాలేరు.

వీరికి భూములిచ్చుట ఇప్పుడు జరుగుచున్నది. కాని ఇవి క్రమక్రమంగా ఇతరుల ఆధీనంలోకి పోవుచున్నవి కొనియో, లేక తాకట్టుపెట్టుకొనియో పెట్టుబడిదారులు స్వాధీనం చేసికొనుచున్నారు. ఇందుకుగాను భూములను వ్యక్తులకు గాక వీరికి సహకారసంఘాలను ఏర్పాటుచేసి ఆ సంఘాలకు అప్పగించుట శ్రేయస్కరము. ఇందువలన వీరికి సహకార జీవనము అలవాటూ చేసినట్లగును భూములు ఇతరులకు అన్యాక్రాంతము కాకుండ చూడనూవచ్చును.

వీరు బాలబాలికలకు చదువు నేర్పుటయు ఒక పెద్దసమస్య. వీరి పిల్లలను బడికి అలవాటు చేయుట కష్టమైన పని. భోజన బస అన్ని వసతులున్న పాఠశాలలలో వీరిని చేర్పించవలెను. వారక్కడ మొదట్లో ఉండుట అనుమానమే. కాని క్రమక్రమంగా అలవాటుపడునట్లుచేయవలెను. అంతకంటె గత్యంతరంలేదు.

సంచారజాతులకు పని పాటలు కల్పించుటయూ కష్టమే. అడవులలో కర్ర కొట్టుటకు, అడవులలో ప్రజలకు కావలసిన వస్తువులను ఏరి తెచ్చుట మున్నగు పనులు ఇప్పుడు వీరికి కల్పించుచున్నారు. బొంబాయిరాష్ట్రంవారు ప్రారంభించిన ప్రత్యేక అడవి సహకారసంఘాలు వీరికీ ఏర్పాటు చేయుట అవసరము. వీరికి స్వేచ్ఛగా తిరుగుట అలవాటు గనుక అటుల తిరిగే పనే వీరికి ఇష్టంగా ఉండును, ఆసక్తితో చేయగలరు.

సంచారజాతులు నేడు అనేక బాధలకు గురియగుచున్నారు. పెట్టుబడిదారులు వీరిని పీల్చి పిప్పిచేయుచున్నారు. అధికారులు వీరిని ఇబ్బంది పెట్టుచున్నారు. వీరిని ఇట్టి కష్టములనుండి తొలగించుటకు రాష్ట్రప్రభుత్వాలు అనేక చర్యలు తీసికొన వలసియున్నది. వీరి రక్షణకు తగు ఏర్పాట్లు ప్రభుత్వం చేయవలెను. వీరిని స్వేచ్ఛగా అడవులలో తిరుగనివ్వవలెను. అడవులలో వస్తువులు తెచ్చుకొని అమ్ముకొనుటకు పర్మిట్లు ఇవ్వవలసియున్నది. ఫారెస్టుఆఫీసర్లు వీరిని అడ్డుపెట్టకుండను బాధలు పెట్టకుండను చూడవలెను. అమెరికాలో ప్రభుత్వం గత ముప్పది సంవత్సరములనుండి రెడ్ ఇండియన్లకు ఇట్టి రక్షణలు కల్పించియున్నారు. ఇట్టి రక్షణలు కల్పించినందుననే రెడ్ ఇండియన్లు అభివృద్ధిలోనికి వచ్చుచున్నారు.

వీరిని ఉద్ధరించుటకు ఈ క్రింది విషయాలను ఇంకను పరిశోధన చేయ వలసియున్నది

(1) సంచారజాతుల జనాభా క్రమంగా తగ్గుచున్నది. ఈ తగ్గుటకు కారణములేమి ? వీరి జనాభా తగ్గుదలను ఎట్లు అరికట్టవచ్చును ?

(2) వీరు తర తరాలనుండి అడవులనుండి తెచ్చి అమ్ముచున్న మూలికలు, దుంపలు, ఆకులు, వగైరా వైద్యమునకు ఎంతవరకు ఉపయోగింపగలవు ?

(3) సంచారజాతులవారు వైద్యానికి ఉపయోగించు మూలికలు వగైరా నేటి ఆధునిక వైద్యాపద్ధతులలో ఉపయోగించవచ్చునా ? వైద్యులు అంగీకరించెదరా ?

(4) వీరిపుడు తినుచున్న ఆహారము పుష్టికరమైనదా ? అందేమైనా మార్పు కావలెనా ?

(౫) సంచారజాతులు అలోపతిమందులు తీసికొనుటకు అంగీకరించుట లేదు. ఇంజక్షన్లు చేయించుకోరు. నవీనవైద్యవిధానమునకు వీరు అలవాటు పడునట్లు చేయుటెట్లు ?

(౬) వీరి మాతృభాషకు భంగము కలుగకుండ, వీరికి ప్రాథమికబడులలో ఎట్టి విద్యావిధానము నేర్పవలెను ?

సంచారజాతులు బలశాలురు. ఆజానుబాహులు. ధైర్యస్థైర్యములు కలవారు. వీరిని యుద్ధవీరులుగ ఎంతవరకు తీసికొనవచ్చునను విషయంకూడ పరిశీలించవలసియున్నది. వారి చరిత్రను పరిశీలిస్తే వీరిలో చాలమంది రాజపుత్రవీరులుగ ప్రసిద్ధిచెందినట్లు తెలియుచున్నది. అందువలన వీరిని ఈ విధంగా ప్రభుత్వం ఎంతవరకు ఉపయోగించుకొనవచ్చుననేది ఆలోచించవలసియున్నది. ఉత్తర భారతంలో శాంతాలులు, దక్షిణభారతంలో అల్లూరి సీతారామరాజుగారి నాయకత్వమున కోయలు బ్రిటిష్‌ప్రభుత్వమును హడలుకొట్టించిన విషయం చరిత్ర చదివినవారికి తెలియును. బీహారులో 1831–32లో భూస్వాములకు ఈ జాతులవారికి పెద్ద పోరాటము జరిగియుండెను. భిల్లులుకూడ బ్రిటీష్‌వారితో 1809లో ఇట్టి పోరాటాలు గావించియున్నారు. కోలి జాతులవారు 1830వరకు బ్రిటీష్‌వారిని ఎదుర్కొంటునే ఉన్నారు. మహారాష్ట్రంలో నాయక్‌లు బ్రిటీష్‌వారి అధికారమును ప్రశ్నించి వారిని తీవ్రంగా ఎదుర్కొనిరి. అండమానులోకూడ మొదట్లో ఆ దీవిలో ప్రవేశించిన ఇతరులతో అక్కడి సంచారజాతులు యుద్ధంచేసి తరిమియున్నారు. ఒరిస్సాలో ఖోండులు 1817లో అప్పటి పరిపాలకులతో పోరాడియున్నారు. వీరు, పిరులుగను, ధీరులుగను, ప్రసిద్ధిపొందిన చారిత్రక కథలెన్నో గలవు. వీరిని సముద్ధరించుటకు పూనుకొనినపుడు వీరి వెనుకగలవారి మనస్తత్వము అర్థము చేసికోవలసియున్నది.

ఈ గ్రంథకర్త ఉద్యోగిగా ఉన్నపుడు ఒకటిరెండుచోట్ల ఈ జాతులవారికి వేసంగి పాఠశాలలను నిర్వహించుట జరిగినది. ఆ పాఠశాలలో చదివిన ఒక

మహిళ ఇపుడు ఆంధ్రప్రదేశ్‌కు చెందిన పార్లమెంటు మెంబరుగా ఉన్నది. ఇంకొక మహిళ శాసనమండలి సభ్యురాలుగా పనిచేసినది. వారిలో కొంతమంది ఉన్నతో ద్యోగులుగ నున్నారు. సంచారజాతులకు సంబంధించిన విద్యావంతులను, ఉద్యో గులను కలిసికొని ఆయాజాతుల అభివృద్ధికి మార్గములను గురించి వారితో ఈ గ్రంధకర్త అనేక పర్యాయాలు చర్చించడం జరిగినది.

వారిలో ముందు నిరక్షరాస్యత నిర్మూలించవలసియున్నది. పిల్లలకు విద్యా బుద్ధులు గరుపవలసియున్నది. వీరికిపుడు అనేకచోట్ల హాస్టల్ వసతులు కలుగ చేయబడుచున్నవి. కాని ఇంకనూ ఈ క్రింది వసతులు హాస్టళ్లలో కలుగచేయ వలసియున్నది.

(1) గ్రంథాలయాలు, బుక్ బ్యాంకులు
(2) పఠనమందిరము అందు వార్తాపత్రికలు, తదితర పత్రికలు
(3) ఆటలు ఆడుకొనుటకు అన్ని ఏర్పాట్లు
(4) తోటపని, కసరతు మున్నగువాటికి వసతులు.

సంచారజాతులుండు ప్రాంతాలలో ఈ క్రింది సౌకర్యములు కలుగచేయ వలసియున్నది.

(1) పిల్లల సంక్షేమకేంద్రములు ఏర్పాటు చేయుట
(2) వారి పిల్లలకు పుష్టికరమైన ఆహారమును సమకూర్చుట
(3) వారి కాలనీలలోను, దగ్గరగల గ్రామాలకు కాలనీలకు రోడ్ల సౌక ర్యము కలుగచేయవలెను.
(4) రక్షిత మంచినీటి సౌకర్యమును కలుగచేయవలెను
(5) వడ్డీవ్యాపారులను తదితర వ్యాపారస్తులను వీరి దరికి చేరనీయ కూడదు
(6) చౌకధరలకు అన్ని వస్తువులను వీరికి సరఫరాచేయవలెను
(7) ఎవరినిపడితే వారిని కాలనీలకు రానీయకూడదు. వారి క్షేమంకోరే వారినే రానివ్వవలసియుండును.

(8) సహకారసంఘములను నెలకొల్పి సహకారసిద్ధాంతమును వారికి అల వాటు చేయవలెను

(9) వైద్య సౌకర్యములు అందుబాటులో ఉంచవలెను.

ఈ జాతుల సంక్షేమమునకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధ తీసి కొనుచున్నది. ముఖ్యంగా ఏజన్సీ ప్రాంతాలున్న శ్రీకాకుళం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, ఖమ్మంజిల్లాలలో ఈ కృషి తీవ్రంగా సాగింపబడుచున్నది.

వీరి బాలబాలికల విద్యాభివృద్ధికి ఆశ్రమం పాఠశాలలు స్థాపింపబడినవి. ఇచ్చట ఉచితంగా భోజన బస వసతులు కల్పింపబడినవి. పుష్టికరమగు ఆహార మివ్వబడుచున్నది. క్రమశిక్షణతో పిల్లలు విద్య అభ్యసిస్తున్నారు. తల్లిదండ్రులు వీరిని బడికిపంపుటకు అంతగా ఇష్టపడకున్నను, ఒకసారి ఈపాఠశాలలకు వచ్చిన విద్యార్థులు తిరిగి వెళ్లుటకు ఇష్టపడుటలేదు. ఏజన్సీ ప్రాంతాలన్నిటిలో పిల్లలను ఆకర్షించుటకుగాను పాఠశాలలో మధ్యాహ్నభోజనము ఏర్పాటు చేయబడుచున్నది. పోలవరంలో బాలురకు ఒక హాస్టల్, బాలికలకు ఒక హాస్టలు నడుపబడుచున్నవి. ఈ జాతులవారి పిల్లలు ఉన్నతవిద్యకుగాను రంపచోడవరంలో ఒక జూనియర్ కాలేజీ నడుపబడుచున్నది. కిన్నెరసానిలో అఖిలభారతంలోనే ఆదర్శప్రాయమగు అన్ని వసతులుగల ఒక పాఠశాల నడుపబడుచున్నది. ఇది పబ్లిక్‌స్కూలువలె నడుపబడుచుండుట ఆ పాఠశాల ప్రత్యేకతయని చెప్పవచ్చును. వీరి పిల్లలకు ప్రత్యేకంగా నర్సరీపాఠశాలలు (3 నుండి 5 సం॥ వయస్సు బాలబాలికలకు) నడుపుట మన రాష్ట్రంలోనే జరుగుచున్నది. ప్రతి ఏజన్సీబ్లాకు హెడ్‌క్వార్టర్సులో ఒక ఉన్నతపాఠశాల స్థాపింపవలెనని ప్రభుత్వం తలపెట్టియున్నది.

ఈ జాతులవారి స్త్రీల విషయమై ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధ తీసికొనుచున్నది. తూర్పుగోదావరిజిల్లా రాజమహేంద్రవరంలో వీరి స్త్రీలకు కుట్టుపనిలో, లేస్‌పనిలో తదితర చేతివృత్తులలో శిక్షణ ఇస్తున్నది. శిక్షణానంతరము ఆయావృత్తులు చేసి జీవించుటకు వలయు పరికరములు ఉచితంగా ఇవ్వబడుచున్నవి ఏజన్సీబ్లాకులలో కూడ మహిళామండలులు స్థాపింపబడి స్త్రీ జనాభ్యుదయమునకై కృషి సాగింప

బడుచున్నది. పిల్లల సంక్షేమానికి బాలవిహారములుకూడ ప్రారంభింపబడినవి. అనాథలకుకూడ కొన్ని శరణాలయాలు నడుపబడుచున్నవి.

వీరికి వైద్యసౌక్యములుకూడ కల్పించుటకు విశేషకృషి సలుపబడుచున్నది. మలేరియా నిర్మూలింపబడుచున్నది. సంచారవైద్యశాలలు ఈ ప్రాంతాలలో నడుపబడుచున్నది. 1976 వరకు 7,654 బాలబాలికలకు పోలియో, క్షయ మున్నగు వ్యాధులు రాకుండ ఇంజక్షను లివ్వబడినవి. ఇతరవ్యాధులకు సంబంధించిన 14,000 కేసులు పరీక్షింపబడి చికిత్స చేయబడినవి.

ఇటీవల కేంద్రంలో ప్లానింగ్‌కమీషన్ అయిదవప్రణాళికకు తుదిరూపమిచ్చినది. షెడ్యూల్డుజాతుల అభివృద్ధికి కార్యక్రమములు నిర్ణయింపబడినవి. వెనుకబడిన ప్రాంతాలలో కేంద్రప్రభుత్వపరిధిక్రింద జరుగు పథకములలో ఉన్నతవిద్య అభ్యసించు విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు, బాలికలకు ప్రత్యేకమగు హాస్టళ్లు, ఇతర వృత్తులలో శిక్షణ, సహకారసంఘాల నిర్మాణమునకు, పరిశోధన మరియు శిక్షణకు వసతులు, మున్నగునవి చేర్చబడినవి. వీటికగు ఖర్చు అంతయు కేంద్రమే భరించును. రాష్ట్రపరిధిలోకి వచ్చు అభివృద్ధి కార్యక్రమాలు ఆయారాష్ట్రప్రణాళికలలో చేర్చబడినవి. వీటికగు ఖర్చు, కేంద్ర రాష్ట్రప్రభుత్వములు సమిష్టిగా భరించును.

అయిదవ ప్రణాళికలో కేంద్రపరిధిక్రింద జరుగు పథకములలో ఉన్నత విద్య అభ్యసించు విద్యార్థులకు ఉపకారవేతనముల క్రింద 2 కోట్లు, బాలికల హాస్టళ్ళకు 1.2 కోట్లు సహకారమునకు 1.44 కోట్లు, పరిశోధన, శిక్షణకు 1.32 కోట్లు, స్వచ్ఛంద సేవాసంస్థలకు గ్రాంట్లకుగాను 1.38 కోట్లు కేటాయించబడినవి. మొత్తం అన్నిటికి 20 కోట్లు కేటాయించబడినవి. రాష్ట్రపరిధి క్రింద వచ్చు పథకమునకు 70 కోట్లు కేటాయించబడినవి. ఈ మొత్తం ఉచితంగా పుస్తకము లిచ్చుట, మధ్యాహ్న భోజనమునకు, యూనిఫారం దుస్తులకు, హాస్టల్ సౌకర్యములకు, వ్యవసాయాభివృద్ధికి, మంచినీటిబావులకు, చేతివృత్తుల సహాయార్థం మున్నగువాటికి కేటాయించబడినది.

నూటికి 50 మందికంటె ఎక్కువ షెడ్యూల్డుజాతులు నివసించు ప్రదేశము లలో ప్రత్యేక అభివృద్ధి పథకములకుగాను 190 కోట్లు కేటాయించబడినది. సంవత్సర సంవత్సరమునకు ఈ మొత్తము హెచ్చింపబడుచున్నది. 1976–77లో 210 కోట్లు కాగా 1977–78లో 350 కోట్లకు హెచ్చింపబడినది.

ఈ జాతుల అభివృద్ధికి క్రొత్త క్రొత్త పథకములు రూపొందింపబడినవి. కంట్రాక్టరులద్వారా మద్యమమ్ము విధానము ఈప్రదేశములలో నిషేధింపబడి క్రొత్త ఎక్సైజు విధానము నిర్ణయింపబడినది. ఆ జాతులవారే మద్యమును తయారుచేసి కొను క్రొత్త విధానమును ఆచరింపబడుచున్నది. వీరికిగల ఋణభారమును తొలగించుటకు అనేక పద్ధతులు అవలంబింపబడుచున్నవి. అప్పులపై మారుటోరియం విధింపబడినది, సహకారసంస్థల ఏర్పాటుకు, ఋణసౌకర్యములు కలుగచేయుటకు అయిదవప్రణాళికలో 76 కోట్లు కేటాయించబడినది.

ఆటవీసంపత్తి వినియోగంగురించి నూతనవిధానము అవలంబింపబడుచున్నది. అడవులలో ఈ జాతులవారికి కొంతవరకు అటవీసంపత్తిని సేకరించుటకు పూర్తిఅధికారము లొసగబడినవి. కంట్రాక్టరుల జోక్యం తొలగింపబడినది. ఎవరు సాగుచేయుచున్నభూమికి వారే కామందులుగ నిర్ణయించుచు మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లలో ఉత్తరువులివ్వబడినవి. ఇతరుల అన్యాక్రాంతంక్రింద ఉన్న భూములను 30వేల హెక్టారులభూమివరకు ఆంధ్రప్రదేశ్‌లోను, మహారాష్ట్రలోను ఈ జాతులకు తిరిగి స్వాధీనం చేయబడినవి.

వీరు నివసించు ప్రాంతములలో మైనర్ఇరిగేషన్ స్కీములకు అధిక ప్రాధాన్యత ఇవ్వబడుచున్నది. ఈ కార్యక్రమము క్రింద 50 కోట్ల రూపాయలు ఖర్చుచేయుటకు నిశ్చయింపబడినవి. ఇందువలన 2–1/2 లక్షల ఎకరాలు క్రొత్తగా సాగులోనికి వచ్చుటకు అవకాశమేర్పడును.

ఈ ప్రాంతాలకు విద్యుత్‌సౌకర్యము కలుగచేయుటకు ప్రత్యేక ఏర్పాట్లు చేయబడుచున్నవి. అయిదవప్రణాళికా అంతమునకు నూటికి 30 వంతుల గ్రామాలకు ఈ సౌకర్యము లభించగలదు. ఒరిస్సాలో తోటలు పెంచుటకై 10,000 ఎక

రాలు ప్రత్యేకించబడినవి. పశువైద్యమునకు ప్రత్యేకమగు ఏర్పాట్లు చేయబడు చున్నవి.

వీరి విద్యాభివృద్ధికై అధిక ప్రాధాన్యత అయిదవప్రణాళికలో ఇవ్వబడినది. ఇందుకు 75 కోట్లు కేటాయించబడినది, విద్య నేర్చుకొనువారి సంఖ్య క్రమంగా పెరుగుచున్నది.

1955–56—12.33 లక్షలు
1961–62—17.82 లక్షలు
1965–66—28.66 లక్షలు
1975–76—37.00 లక్షలు

ఉపకారవేతనములు పొంది ఉన్నతవిద్య చదువుకొనువారి సంఖ్య 1951–52లో 5 వేలుకాగా 1967–67లో 10 వేలు, 1977–78లో 60 వేలవరకు పెరుగగలదని అంచనా వేయబడినది.

సంచారజాతుల సర్వతోముఖాభివృద్ధికి చేయుకృషి ఫలించుటకు చాలకాలము పట్టవచ్చును. కాని కృషి ఎల్లపుడును సాగుచునే ఉండవలెను. వీరు సంక్షేమము నకై జీవితసర్వస్వము ధారవోయుచున్న శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య మహనీ యుని అమూల్యమగు సలహాలతో ఈ గ్రంధము ముగించబడుచున్నది.

''సంచారజాతులను బాగుచేయు సమస్యను ప్రపంచంలో అన్ని దేశాలవారు తీవ్రంగా ఎదుర్కొనుచున్నారు. ఆస్ట్రేలియా, అమెరికా, కెనడా, రష్యాదేశా లలో ఇందుకై గావించుచున్న కృషి ప్రశంసనీయమైనది. భారతదేశం ఈ కృషిని గమనించి మన దేశానికి అవసరమగు మార్పులతో వారవలంభించు పద్ధతులు అచర ణలో పెట్టవలసియున్నది. కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు ఇందుకు నిరంతరము కృషి సాగించి సంచారజాతుల సర్వతోముఖాభివృద్ధి సాధించవలసియున్నది.''

—★—

# నిరంతర సంచారి

పుట్టుట మొదలుగా గిట్టునందాక
కొంపతోఁ గోడుతోఁ గ్రుమ్మరుచుండు
సరిహద్దులే లేని జగతి పౌరుండు
అతని అక్కఱ లల్పములే ; కాని
కలకాల మాతనిఁ గలవేమొ విడదు.

ఆంగ్ల మూలం : శ్రీ సి. ఎల్. బక్షి,
తెలుగుసేత : శ్రీ సి. హెచ్. మస్తాన్‌రెడ్డి.

# REFERENCE BOOKS USED


1. 'Nomads' by Sri V. Raghavaiah Garu
2. 'Castes and Tribes' by Thurston
3. 'History of Mankind' by Jacquetta Howkes
4. Books on Aboriginals by Dr. Verier Elwin
5. 'Every day life in the old stoneage' by C. H. B. Quennell
6. The Encyclopaedia of Social Sciences
7. Explorations in Cultural Anthropology by W H. Good
8. 'Gipsies' by Bhikshu Caman Lal
9. 'The peoples of Malasia' by Fay - Cooper Cole.
10 'Eskimos' by Coon
11. Books on Aboriginals by Dr. D. N. Muzamdar
12. 'Tribes of Kerala' by A. A. D. Luiz
13. 'Man and his life the world over' by R W. L Walder
14. Report of the Sub committee of the Central Advisary Board for Tribal welfare (1959)
15. Tribes and Castes of N. W. provinces by Sri William Grooke
16. 'Thugs' by S. VenuGopalaRao
17. Report of Raghavaiah committee (A. P.) 1960-62
18. 'The Red Indian' by Khaja AbdulGafoor
19. Book on Rehabilitation by Dr B S. Guha. Ex. Director of Anthropology, Govt. of India.
20. Report of Dhebar Commission
21. Recommendations of the I. L O.
22. 'Caste and the Economic Frontier' by Bailay F. G.
23. Censuss of India Report 1971
24. 'Vanya jathi' issues
25. Books on the subject so far published by Bharatiya Adimajati Savak Sangh.
26. Fifth Five Years Plan.

# గ్రంథకర్త పరిచయం

[1940 సం॥నుండి నేటివరకు ఈ గ్రంథ రచయితను గురించి పెద్దలు అప్పు డప్పుడు పంపిన అభిప్రాయాలను క్రోడీకరించి క్లుప్తంగా ఈక్రింద ప్రకటిస్తున్నాము. — ప్రకటన కర్తలు.]

**శ్రీ ఎ. వి. థక్కర్ బాపా**
**(హరిజన సేవక్ సంఘాధ్యక్షులు, ఢిల్లీ)**

"శ్రీ నాగభూషణాచార్యులు ఆదిమవాసుల, సంచారజాతుల తదితర వెనుక బడిన తరగతులవారి సంక్షేమమునకై చేయుచున్న కృషిని గురించి తెలికొని చాల సంతోషిస్తున్నాను. ఇందుకు వారికి నా అభినందనలు తెలుపుచున్నాను. వారి చరిత్రనుగురించి ముఖ్యంగా ఎరుకలవారినిగురించి పరిశోధన చేయుచున్నట్లు తెలిసి కొన్నాను. వారికి భగవంతుడు సాయపడుగాక!"

**శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య**
**(కార్యదర్శి, అఖిలభారత ఆదిమజాతి సేవాసంఘం, నెల్లూరు)**

"శ్రీ ఓబిళ్ళాపూరు నాగభూషణాచార్యులు నాకు బాగా తెలియును. వారు ఉద్యోగధర్మాన్ని నెరవేరుస్తూ, ఆదిమవాసులయెడల అపారమైన శ్రద్ధను, ప్రేమను చూపుచు, వ్యాసాలు, గ్రంథాలు వ్రాయుచు, వారిని ఉద్ధరించు ప్రయత్నాలకు దోహదమొనర్చుచు ప్రశంసనీయముగ వారికొరకు పాటుపడుచున్న దేశభక్తులు."

**గ్రంథాలయపితామహ శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు**

"మిత్రులు శ్రీ నాగభూషణాచార్యులు నాకు బాగా తెలియును. గ్రంథాలయో ద్యమమునకు వారు పల్లెలలో చేసిన సేవ స్వయంగా చూచి ఆనందించాను. తత్వానందాశ్రమంలో వారిచే నడుపబడిన వయోజన, పంచాయతీ శిక్షణాతరగ తులకు ప్రధానాచార్యులుగనున్నాను. వారి సేవాభావము ప్రశంసనీయమైనది."

**శ్రీ బెజవాడ గోపాలరెడ్డి**
**(మాజీ గవర్నర్, ఉత్తరప్రదేశ్)**

"శ్రీ ఓబిళ్ళాపూరు నాగభూషణాచార్యులు మిక్కిలి కృషిచేసి పరిశోధన సలిపి 'ఆదిమవాసులు'లపై గ్రంథమును వ్రాసి వెలువరుచుట ఎంతయు సమంజ సము. వారి కృషి చాల ప్రశంసనీయమైనది."

శ్రీ జలగం వెంగళరావు
(ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్)

"శ్రీ నాగభూషణాచార్యులు కాకలుతీరిన జాతీయవాదులు. హరిజనులను ఆదిమవాసులను ఉద్ధరించడానికి, శిల్పుల అభ్యున్నతి వీరు సాగించిన కార్యక్రమాలు ప్రశంసార్హము. గ్రామపంచాయతీల విషయంలో వీరికున్న పరిజ్ఞానం అపారము."

శ్రీ ప్రభాకర్ జీ
(సర్వోదయ నాయకులు)

"శ్రీ నాగభూషణాచార్యులు ఆదిమవాసులకు చేసిన సేవ గణనీయమైనది. ఆదిమవాసుల గురించిన పరిశోధన గ్రంథాలను ప్రచురించడమేగాక, వారి అభివృద్ధికికూడ ప్రత్యక్షంగా ఎంతో సేవ చేశారు. ఒక్క ఆదిమవాసులకే కాదు హరిజనులకు, వెనుకబడిన తరగతులకు ఆయన నిరంతర సేవ లభించింది."

శ్రీ కాశీకృష్ణాచార్యులు D. Lt.
(మాజీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవి)

"శ్రీ చిత్తాపూరు నాగభూషణాచార్యులు వాడు గొప్ప ప్రజాసేవకులు. వారి జాతీయాభిమాన సాంఘిక సేవాదులు ప్రశంసనీయమైనవి వారికి "దీనజనోద్ధారక" బిరుద ప్రధానముతో నా అభినందనమును ప్రకటించుచు వారికి ఆయురారోగ్య భాగ్యోత్సాహాశక్తులు గలుగుగాక యని యాశీర్వదించుచున్నాను."

శ్రీ యమ్. ఆర్. అప్పారావు
(మాజీ రాష్ట్ర మంత్రి, ఆంధ్రవిశ్వవిద్యాలయ వైస్‌ఛాన్సలర్)

"హరిజనులకు గిరిజనులకు, ఎరుకలవారికి, యానాదులు మున్నగు దీనాతిదీనులకు వీరు చేసిన సేవ అపారము. శిల్పులకు, శిల్పకళకేగాక "పంచాయతీరాజ్యం" పరిపాలనాభివృద్ధికి వీరు చేయుచున్న కృషి జగద్విదితము."

శ్రీ యల్. యన్. రావు
(శ్రీ ఠక్కర్‌బాబా అంతరంగిక కార్యదర్శి, హరిజనసేవక్ సంఘం ఢిల్లీ)

"శ్రీ నాగభూషణాచార్యులు చిత్తశుద్ధి, ఉత్సాహము, కార్యదీక్షగల ఉత్తమ ప్రజాసేవకులు. వీరు ఆదిమవాసులకు వెనుకబడిన తరగతులవారికి చేసిన సేవ చిరస్మరణీయం."

దర్శనాచార్య, కళాప్రపూర్ణ శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు
(వ్యవస్థాపకులు, ప్రధానకార్యదర్శి ఆంధ్రశిల్పకళాపరిషత్తు,)

"ఒక విద్యావేత్తగా, శిల్పకళావేత్తగా, గ్రంథకర్తగా, పత్రికాసంపాదకుడుగ, ఆదర్శఉపాధ్యాయుడుగా, ఉన్నతోద్యోగిగా, దీనమానవ సేవకుడుగా, మానవధర్మ ప్రబోధకుడుగా శ్రీ చిట్టావూరు నాగభూషణాచార్యులు వారు ఆంధ్ర దేశానికి చేసిన సేవ అమూల్యమైనది. చిరస్మరణీయమైనది. సువర్ణాక్షరాలతో లిఖించతగినది."

శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య
(మాజీ శాసనమండలి అధ్యక్షులు)

"శ్రీ ఆచార్యులవారు అజ్ఞాతంగా జాతీయనాయకుల ఆజ్ఞలను శిరసావహించి జాతీయోద్యమమును ప్రోత్సహించిన సందర్భాలు నాకు తెలుసు. హరిజనోద్ధరణకు, ఆదిమవాసుల అభివృద్ధికి, తదితర వెనుకబడినజాతుల ఉద్ధరణకు వీరు ఎంతగనో సేవ చేసియున్నారు."

శ్రీ డాక్టర్ కె. యల్. రావు
(మాజీ కేంద్రమంత్రి)

"శ్రీ నాగభూషణాచార్యులు స్వాతంత్ర్యసమరంలో ఒక ఉత్తమమైన సిపాయి పాత్ర నిర్వహించిన ఒక ఆదర్శవ్యక్తి. ఆదిమవాసులకు, వెనుకబడిన తరగతులవారికి సేవ చేయుచున్నారు. "పంచాయతీరాజ్యం" పత్రికద్వారా, ఆ విషయంపై గ్రంథములు వ్రాసియు ఈ కర్మయోగి చేయుచున్న సేవ మన చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడగలదు."

శ్రీ బి. యస్. మూర్తి
(మాజీ కేంద్ర ఉపమంత్రులు)

"శ్రీ నాగభూషణాచార్యులు హరిజనుల, ఆదిమవాసుల ఉద్ధరణకు ఎనలేని కృషి చేసి మహాత్మాగాంధి, థక్కర్‌బాపా వంటి పెద్దల ప్రశంసలనందుకొని యున్నారు. "పంచాయతీరాజ్యం" పత్రిక ద్వారా గ్రామాభ్యుదయానికి, శిల్పకళాభివృద్ధికి, శిల్పులు అభ్యున్నతికి "విశ్వశిల్పి" పత్రికను నడుపుచూ తమ సేవను సాగించుచున్నారు".

# "NOMADISAM IN ANDHRA PRADESH"

"PAPER"

Prepared by

*Chirravuru Nagabhushanacharulu*

President of the Souvenir committee
of the Andhra Pradesh Nomadic Tribes welfare Conference
and Seminar

held at Guntur on 23—4—1967

Under the presidentship of Sri U. N. Dhebar,
president of the Bharathiya Ghumanthu Jan
(Nomadic Tribes) Sevak Sangh.

As one aptly said "The Cuckoo cannot help cooing; the cloud cannot help bursting; the fish cannot help swimming; the nomad, similarly, cannot help wandering"

There are several categories of nomads, living at varying stages of nomadism and following pursuits most suitable to their wandering habits, in this country. Nomadism cannot be described as a characteristic of individuals. It may be either the inheritance of a hoary past, or the direct or indirect consequence of environment. Where nomadism is a relic of an ancient past, either traditional or environmental, it gradually becomes a habit, which a nomad cannot easily shake off, nor does he desire to do it either. It may be assumed, that nomadism is a cultural trait which results from want of ambition or aspiration, either total or partial.

Before dawn of civilization, nomadism seems to be a regular feature of life of man during the Old and New Stone Ages. Gradually as the environment changed and man made advances in technology some have settled, while others continued their wanderings from place to place. Nomadic tribes are found even today in almost all the countries of the world. Nomads constitute a significant part of 60 crores population of India.

Anthropologists say that there are more than twenty nomadic tribes in Andhra Pradesh. Their popoulation is estimated at about fifteen lakhs. Let me deal with them briefly one by one.

### (I) The Chenchus:

The Chenchus are classified as Cultural Nomads. Their population according to the census of 1961 is 17,609. They inhabit mostly in the Nallamala range of the Eastern Ghats, South of the Krishna and North of the Pennar rivers in Andhra Pradesh. They are exceedingly black, with long hair, and on thair head wore caps made of leaves. Each man had with him, unbarbed arrows and a bow for hunting. The staple food of the Chenchus conaists of cereals, yams, and some jungle roots which they dig out with their digging stick, forest fruits and various animals such as crow, lizard, bear, peacock and black monkey. The problem of the Chenchu is the problem of Nallamalas. The Chenchu is forced to be a nomad for full five months in the year. Among the Chenchus, education is nil, ambition totally absent and the desire to emulate and improve long ago dead.

## (2) Challa Yanadis :-

Among the tribes of Andhra, Yanadis and particularly challa section of them, can be treated as cultural nomads. Their population can be roughly estimated to be about forty thousands. Owing to their still persisting food habits (ie) feeding upon field rats, bandycoots crabs and the leftovers of the table on festive occasions, their comparitively unclean habits, they are treated as untouchables. Due to extreme poverty, they go almost naked except for a rag, subsist on a single meal. They are good divers. They are keen on fishing. They are clever at catching cobras, The honey collection by them is a very skilful pursuit. They are good huntsmen and devoid of fear in the jungle. They reside in huts living on jungle produce. Their religion is animistic in nature.

## (3) Lambadis :-

Lambadis otherwise known as Sugalis or Banjaras are another inter - state sect of cattle breeders, possessing expert knowldge of cattle rearing. The total population in Andhra Pradesh is roughly estimated at 11 lakhs. Mostly they live in "Thandas" usually situated nearest to the forest. Their administration of Thundas bears the characterestics of monorchical form of Government. The women drive the cattle and are the robust we ever saw in India. In census reports, the Lambadis are described as a clan of traders, herdsmen, cattle breeders and cattle lifters. Huts of Banjaras are very temporary structures made of wattle. There is an air of encampment about their villages which suggests a gipsy life. Elaborate tattooed patters are the hall mark of every Lambadi woman.

(4) **Yerukalas** :-

The Yerukalas are a South Indian nomadic tribe, population being nearly one lakh in coastal Andhra according to the census of 1961. Being small traders they are constantly on the move, selling salt, pulses, Karivepaku, making and selling baskets, food grain containers, manure carriers, basket measures winnows, screens and several other articles of day to day used by the farmers. Being generally intelligent, the women more intelligent and hard working than men, practise thought-reading and earn well by reading the palms of gullible women and telling "Yeruka", a bright future for them. No Yerukala begs alms but tries to earn a living by pursuing his trade. Yerukalas are found in Maharastra, Madras, and Mysore states called by different names as koravas in Madras, Korachas in Mysore and Kaikadis in Maharastra Having been declared as a Criminal Tribe, they had been subjected by the police to great and insufferable persecution and confinement to settlements. After the abolition of Criminal Tribes Act, they are free. They are admitted into the list of Scheduled tribes by the Central Government. They are dark, have curly hair, hoarse throats, tall frames, rough skins and do not usually suffer from any ailments. They are very intelligent, agile, quick to grasp, slow to retaliate. They decide their disputes before thier Panchayathi and through clan justice. They communicate with each other in their own language. They usually move in small groups, two or three at best and always camp outside the towns or villages. By God's grace. the author lived amongest them in Stuartpuram Settlement for over four years and worked for their betterment in organising a Provincial Association, running a 'Yerukala' News paper and organising special training classss etc.

### (5) Yanadis :-

Yanadis are a timid, amenable, genial but slothful race with a history as old as the early savage state of human existance. Their population is about 2,15,381 in 1961. There are very few criminals in Yanadis but even they are not hardened criminals given to highway crime. Yanadis are excllent, obliging, gentle and fairly honest domestic servants. After the abolition of C T. Act they are free. They are also included in the list of Scheduled tribes and enjoying all facilities. Nomadism of the yanadis is slowly declining with the generous measures taken by the Govt. and social organisations. They have been more sinned against than sinning,

### (6) Dommaras :-

They are a wandering tribe found all over Andhra Pradesh. They are hardy and sturdy, They speak polyglot. They eat cats, crows, squirrels, snakes and mongooses. The Dommara language is believed to be the Mundarian in origin. Tattooing is common among them and possess a magical value. Dommara women are slim wirry and submit themselves to several twists of their bodies in the acrobatic feats and can do tight-rope walking. Some girls are married to the gymnasium pole or to the sword as a symbol, perhaps signal, of her availability to the public.

### (7) Kattaras .

Katteras might have got this name on accou of their unhesitating use of a pair of scissors in sev ring necklaces from unwary pilgrims, festive gatherers and those in sound sleep. They are interstate buglars Katteras are intelligent, cruel and even untrustworthy

**(8) *Dasaris:***

These are criminal beggers. When they go for theiving, they see omens and seek the tacit permission of the Goddess for embarking on crime. Whenever caught, they give wrong personal names to escape investigation.

**(9) *Katipapalu* :-**

They levy fee on the Madigas as a relic of by-gone superiority. They were once collecting a fee levied by them on burial grounds. They even now put on mock crowns made of pith and gathering glass-pieces and visit villages begging alms.

**(10) Pamulas :-**

The Pamulas are a tribe of snake charmers living a nomadic life. Their main source of living is snake-charming. The Pamulas catch the cobras and tame them and take to begging. They extract the poison from the snakes and sell as it is used in Ayurvedic Medicine. They eat crows, cats, lizards and rats They are intelligent and can be trained to pursue skilled avocations. They live in the outskirts of towns and villages.

**(11) Dok*k*alas :-**

Dokkalas are to some extent educated. Every Madiga family is bound to pay the Dokkala every year some fixed amount. Each Dokkala family unit has got jurisdiction over 100 villages. They believe that it is not auspicious to live in huts provided with walls. They eat carrion too. Dokkalas are untouchables to Malas.

12) **Mandulas .-**

They wander from place to place selling herbal ledicines and talismans. Mandulas carry their belong- ıgs on donkeys. They sell beads and mirrors as a ide occupation. Every member of the community is ıught the art of healing from boyhcod. They also ıll vermillion, keys, locks and other fancy articles. hey also rear and sell goats. Some of them embrace ıristianity out of necessity. They worship Lord Ven- ıteswara also.

3) **Budabukkala :-**

They are a semi - nomadic tribe who visit homes ırly in the mornings and bless. They put on strange ead–dress, wear multi-coloured flowing roles and also ear an old black umbrella. The are being suitable warded. They live by begging.

4) **Girikals :-**

A small roamming tribe in Adilabad District. hey speak no other language but Telugu and are a ction of the beggarly clan. They eke out their liveli- ood by entertaining public with "Rangularatam" parti- ılarly in Jatharas. They inflict upon themselves blee- ing wounds by forcibly twirling a thick sharp edged ope to evoke pity and secure alms.

5) **Rajamallus :-**

They live mainly on begging. They wander for ight months begging and return to their village in arimnagar District. Their huts are very flimsy. They vere miserably dressed. They had drum and use it ke Budabukkalas for eliciting charity.

**(16) Perikamuggulas :-**

They are professional tattoing women in the Andhra Pradesh. They live by beggary, soothsaying and tatooing. They also live by prostitution in the villages. They do not have any separate language of their own.

**(17) Nakkalas .-**

This community is chiefly found in coastal Andhra Districts having primitive habits. They catch birds, sell them in the villages and make a living.

**(18) Mondi Banda :-**

They are noted for their obstinancy. They go out with stones for begging and threaten to beat on their brains, if alms are not forthcoming. They are tall and robust. When engaged in begging, they cut the skin, vomit and roll in the dust. The caste is divided into series of bands each of which has the right to collect alms with in a particular area. This tribe is found in coastal Andhra and Rayala Seema areas. They live by begging They live by singing songs praising people. Because they are persistant in their demands, they are called Mondi Bandas.

**(19) Balasanthu :-**

They are mostly 'ballad reciters' such as Bobbili-kadha, Ganga parvathi and other puranic stories. They are found in Telangana as professional beggars and semi-nomads. They speak only Telugu. The women folk weave mats and the males go for begging They catch and eat foxes, rats and udumulu. They are intelligent people and can develop their condition, if proper facilities are given.

(20) **Pichiguntalu :-**

They are beggars and also medicants who are herbalists and give physic to people to cure fever, Stomachache and other ailments. They beat the village drums, relate stories and legends. The Pitchiguntalu visit the houses of ryots and then read out their Kula Gotras for which they are rewarded They narrate stories making sound with a musical instrument at nights for which villagers gather in large numbers. They are also good pig - rearers. They perform Hindu festivals and worship all the Hindu deities.

(21) **Peddinti Gollas .-**

The women live by tattooing. Men live by practising Modi (Mesparism). They also sell petty medicines. All that they own are one portable hut, few utensils and one or two donkeys. They carry few poultry and few pigs. They are chiefly found in Rayala Seema.

(22) **Nirshikris :-**

This is a tribe found mostly in kurnool and Ananthapur Districts. Their main occupation is begging. These people are very garrulous very nimbla of foot, thoroughly intelligent and commit crimes.

(23) **Bynollu :-**

They entertain villagers by singing parises of God and Goddesses and their miracles. They are in great demand in villages during Jatharas. They are said to be priests of Madigas and they are found in kurnool and Anantapuram Districts of Andhra Pradesh.

(24) **Pusala :-**

They sell pusalu (beads). They sing several stories with Thumbura and Dhakki. They are found in almost all the districts of Andhra area. They are very backward, illiterate and uncivilised. They can be seen sitting on the road side in towns selling some articles.

The following are some of the ameliorative measures suggested for the development of the Nomadic Tribes.

(1) The tribal grants made so far failed to reach the nomad, thongh they were amply utilised by the settled groups. Many grants sanctioned for the purpose were allowed to be lapsed. This should be enquired into thoroughly and remedies implimented.

(2) The work of amelioration of this section should be entrusted to honest and sincere social workers but not to the officers of the Govt., as far as possible.

(3) The social workers who are entrusted with this work have to study well in advance the prejudices, superstitions, and pet - beliefs of a tribal.

(4) The advice and guidence of the anthropologists have to be taken in this work.

(5) The social worker has to meet them very often and win their confidence slowly by providing them their wantings like clothing, medical facilities food supplies etc.

(6) Colonies for this nomads should not be constructed as a road - side show piece but far from

villages but near the forests so that they may wander in the forests freely as they have been doing before

(7) They should be supplied with a house-site free of cost and the nomad must be allowed to construct a neat thatched hut costing about a hundred rupees each, supplying material and encouraging him to put in as much self-effort as he could, so that he may feel that the house is his own. Other facilities, such as protected water supply midical help etc. should be provided by the organisers

(8) The social worker has first to understand their way of life, appreciate all the good that is in them and then try to modernise them and mould them to become present day citizens.

(9) The tribal worker either official or non-official has to study and try to understand their religion and should not on any account criticise or laugh at tribal ceremonies or beliefs.

(10) He should not exhibit a superiority complex in his or her talk, walk and dress and do well to climb down to the level of the beneficiaries.

(11) The best way of winning a tribal's confidence is by sailing with him and not by crossing his path at every step.

(12) The Panchayats of the tribals should be respected and they can be left to themselves in deciding the disputes atleast for a few more years to come.

(13) Lakshs of acres of Government land allotted to Harijans and tribal people on an individual basis is rapidly passing into other hands and this should be checked. The lands should be assigned by Government in cooperative societies of the beneficiaries.

(14) Tribal education should be provided by starting Ashramam schools and hostels for them with all free facilities.

(15) Special forest cooperative societies may be started for them on the lines in Maharastra State.

(16) The four problems that face the workers about nomads are (1) Social ignorance about the nomads (2) Stark poverty of nomads (3) Illiteracy amongst them and (4) Rehabilitation which have to be tackled in right earnest.

JAI HIND



గ్రంథకర్త

కృష్ణాజిల్లాలో జాతీయోద్యమమునకు ప్రసిద్ధి చెందిన 'కొనకంచి' వీరి జన్మస్థానము. గాంధీమహాత్ముని ఆశయాలయందు ఆసక్తి కలవారై యథోచితంగా స్వాతంత్ర్యోద్యమమును ప్రోత్సహించుటయేగాక, మహాత్ముని నిర్మాణ కార్యక్రమ నిర్వహణకు 'తత్వానంద శిల్పాశ్రమము', ప్రాచీన భాషాభివృద్ధికి 'ఓరియంటల్ హైస్కూలు' స్థాపనకు, నిర్వహణకు కారకులైరి.

విద్యార్థి దశ నుండియు గ్రంధాలయోద్యమంలో పాల్గొనుచుండిరి. వారి స్వగ్రామంలో గ్రంథాలయ స్థాపనకు తోడ్పడిరి. వారుద్యోగపరిధిలో గల పెక్కు గ్రామాలలో గ్రంథాలయాల స్థాపనకు, గ్రంథాలయాల అభివృద్ధికి ప్రోత్సహించిరి. గుంటూరుజిల్లా గ్రంథాలయ సంఘాధ్యక్షులుగను, గుంటూరుజిల్లా గ్రంథాలయ సంస్థ సభ్యులుగను ఎన్నుకొనబడి గ్రంధాలయోద్యమమునకు ఇతోధికంగా కృషిచేసిరి. ఉపాధ్యాయులుగ కొన్నేండ్లు, వివిధ దశలలో పంచాయతీ ఆఫీసరుగ, బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరుగ పెక్కేండ్లు పనిచేసి 1964 లో రిటైరయినారు.

గ్రామపంచాయతీల అభివృద్ధికి 'పంచాయతీరాజ్యం' అను పక్షపత్రికను 24 సంవత్సరముల నుండి నిర్విఘ్నముగ నడుపుచున్నారు. గ్రామపంచాయతీల చరిత్రను తెలుపు 'పంచాయతీరాజ్యం' అను గ్రంథమును 1949 లోను, 'గ్రామ పంచాయతీ పరిపాలనము' అను గ్రంథమును 1965 లోను, 'పంచాయతీ ఎకౌంట్సు - ఆడిట్ మాన్యుయల్' అను గ్రంథమును 1970లోను రచించినారు.

'ఆదిమవాసులు' అను గ్రంథమును 1949లో రచించి ప్రకటించియున్నారు. 'ఎరుకల' అను పత్రికను కొన్నాళ్లు నడుపుటకును, రాష్ట్ర ఎరుకల సంఘమును స్థాపించుటకు, వారి సభలు జరుపుటకు ప్రోత్సహించి యున్నారు. ఈ జాతుల గురించి నిరంతరము పరిశోధన జరుపుచున్నారు.

శిల్పవంశమునకు చెందిన వీరు, శిల్ప కళాభివృద్ధికి 'విశ్వశిల్పి' అను మాసపత్రికను 10 సంవత్సరములనుండియు నడుపుటయేగాక 'అఖిల భారత శిల్పకళాపరిషత్తు'కు అధ్యక్షులుగను, 'ఆంధ్రప్రదేశ్ శిలాశిల్పుల మహాసంఘము'నకు అధ్యక్షులుగను ఆంధ్రప్రదేశ్ లలితకళా ఎకాడమీలో సభ్యులుగను ఎన్నుకొనబడి శిల్పకళాభివృద్ధికి, అనేక మహాసభలు, సదస్సులు, శిల్పకళా ప్రదర్శనములు జరిపి యున్నారు.

వీరి కిపుడు 68 సంవత్సరాలు. దైవానుగ్రహంవలన వీరు తమ కర్తవ్యములను నిర్విరామంగా, నిరాడంబరంగా, నిర్విఘ్నంగా కొనసాగించుచున్నారు.

— ప్రకటన కర్తలు.